# శత్రు సంహారం!































* కార్బాక్సిల్ ఏసిడ్ గ్రూప్ ఫార్ములా— పళ్ళ ఎనామిల్‌ను నష్టపరిచి, దానిని కరిగించి పిప్పి పళ్ళను కలిగించేది.

గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్ — మొదటి బహుమతి రు. 15
కేమెల్ — 2వ బహుమతి రు. 10
కేమెల్ — 3వ బహుమతి రు. 5
కేమెల్ — 5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్ — 10 సర్టిఫికెట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.



12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name:-______________________________ Age ____________

Address ____________________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

**CONTEST NO. 12**

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. *31-12-1979*

**Results of Chandamama—Camlin Colouring Contest No. 10 (Telugu)**

*1st Prize:* Y. N. Sreenivas, Hyderabad. *2nd Prize:* B. S. Ratnam, Vishakhapatnam-1. *3rd Prize:* T. Padhika, Kakinada. *Consolation Prizes:* Mr. M. Anand Allahabad; B. S. Ratnam, Vishakhapatnam-530 001; J. Srinivas, 94/1, Waltair; S. Shiva Kumar, Jagital Puramipet, 505 327; Pichika Srinivas, Rajhamindry-3.



# చందమామ

డిసెంబర్ 1979



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు








# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''మాటవిలువ'']కు ఆధారం ''వసుంధర'' రచన. మనుషులు మాట్లాడే మాటలకు అర్థాలు తెలుసుకోవాలంటే నిఘంటువులు చూడాలి. వాటికి విలువ కట్టాలంటే మనిషి సంస్కారం చూడాలి. మనం తప్పు చేస్తే మందలించే వారిలో మన హితం కోరినవారూ ఉండవచ్చు. మన మీద కక్ష సాధించేవారూ ఉండవచ్చు.

## అమరవాణి

పుంసా మున్నతచిత్తానాం ద్వయ మేవ సుఖావహమ్,
సర్వసంగనివృత్తి ర్వా, విభూతి ర్వా సువిస్తరా.

[ ఉన్నత భావాలు గల పురుషులకు సుఖం కలిగించేవి రెండే ;
సర్వసంగపరిత్యాగమో, అమితమైన ఐశ్వర్యమో ! ]

సంపుటి 65 డిసెంబర్ '79 సంచిక 6

CHITRA




ఎ. మదన్ కుమార్, బరంపురం

ప్ర: భయంవేసేటప్పుడు గుండె జోరుగా కొట్టుకొనుటకు కారణం?

జ: మనిషి శరీరంలో మూత్రపిండాలకు ఎగువగా, వెన్నుపాముకు రెండుపక్కలా రెండు గ్రంధులు (glands) ఉంటాయి. వీటిని "ఎడ్రినలీన్" గ్రంధులు అంటారు. ఈ గ్రంధులలో పైపొరా లోపొరా ఉంటాయి. శరీరం యొక్క అవసరాలను బట్టి గ్రంథులు వేరువేరు స్రావాలను సరఫరా చేస్తాయి.

ఏ కారణం చేతనైనా ఇలాటి స్రావాలలో హెచ్చుతగ్గులు జరిగితే శరీరారోగ్యం దెబ్బతింటుంది. ఆకస్మికంగా మనిషికి భయోద్రేకం కలిగినప్పుడు ఎడ్రినలీన్ గ్రంధి తాలూకు లోపలి పొర నుంచి "ఎపినెఫ్రీన్" అనే పదార్థం రక్తంలోకి స్రవిస్తుంది. దీని ఫలితంగా చర్మం పాలిపోవటం వగైరా లక్షణాలతోబాటు గుండె వేగంగా కొట్టుకోవటం కూడా జరుగుతుంది.

వి. కేశవనారాయణ, వ్యాసరపాడి

ప్ర: సూర్యునికి వివిధ దిశలలో గ్రహాలు ఉంటాయి. కాని గ్రహాలన్నీ సూర్యునకు ఒకే దిశలో ఉంటే జరిగే ఫలితము ఏమిటో తెలియజేయండి.

జ: కొన్ని సంవత్సరాల క్రితం, అష్టగ్రహకూటం రాబోతున్నదనీ, సముద్రాలు పొంగి, మహా నగరాలే మట్టిదిబ్బలవుతాయనీ హంగామా చేశారు. కాని ఏమీ జరగలేదు. హంగామా చేసినవాళ్లూ, ఊళ్లు వదిలి పారిపోయినవాళ్లూ నవ్వులపాలయారు. భూమికి ప్రకృతి వైపరీత్యాలు—ఉప్పెనలూ, భూకంపాలూ, అసాధారణ ఉల్కాపాతాలూ, అగ్నిపర్వతాల పేలుళ్లూ—కలుగుతూనే ఉన్నాయి. కాని వాటికీ, గ్రహ గతులకూ సంబంధం ఏమిటో చెప్పినవారు లేరు.

ఇంతకూ సుమారు 180 ఏళ్లకు ఒకసారి గ్రహాలన్నీ సూర్యుడికి ఒకేపక్క సొల్పులో నిలబడుతూంటాయి. అందుచేత చరిత్రకాలంలో అనేకసార్లు మీరు చెప్పేది జరిగి ఉండాలి. అందువల్ల ఏమి జరిగేదీ చరిత్ర చూసి తెలుసుకోవచ్చు! బహుశా ఏమీ జరగదు. ఏమైనా జరిగి ఉంటే శాస్త్రజ్ఞులు ఎప్పుడో కనిపెట్టి ఉండేవారని మనం ఊహించవచ్చు.




# 78

ముసలి కోతి చాలాసేపు దుఃఖించి, ''ఆనాడు అవి నా మాట వినక, ఈ గతికి వచ్చాయి. దుర్మార్గుడైన రాజు మీద నేను ఎలా పగ తీర్చుకోవాలి? తన వంశానికి జరిగిన అన్యాయాన్ని పిరికితనం వల్లగాని, స్వార్థంతోగాని సహించేవాడు పరమహీనుడని చెబుతారు. నా వంశం నాశనమయినందుకు తప్పక ప్రతీకారం చెయ్యాలి,'' అనుకున్నది.

పగ తీర్చుకునే పథకం ఆలోచిస్తూ అది అడవి అంతా తెగతిరిగింది. ఎంతసేపు తిరిగినా ఏ పథకమూ తట్టలేదు. ఆ రోజు చాలా వేడిగా ఉన్నది. దానికి దాహం వేసింది. నీటికోసం తిరుగుతూ అది ఒక తామరకొలను వద్దకు వచ్చింది. అక్కడ ఉన్న నిశ్శబ్దం భయం కలిగించేదిగా ఉండి, ప్రమాదాన్ని సూచించింది. అది జాగ్రత్తగా గమనించి ఒక విషయం గ్రహించింది: నీటి కేసి వెళ్ళే అడుగు జాడలున్నాయిగాని, తిరిగి వచ్చిన అడుగు జాడలు లేవు.

''ఈ మడుగులో తప్పకుండా మొసళ్లు ఉండి ఉండాలి. నీటికోసం వచ్చే జంతువులను అవి పట్టి తినేస్తున్నాయి. అందుచేత నెను నీటిలో అడుగుపెట్టకుండా, తామరతూడుతో నీరు తాగేస్తాను,'' అనుకుని, ముసలికోతి నీటి మట్టానికి ఎగువగా ఉన్న మెట్టు మీదికి దిగి, కర్రతో తామర కాడను పైకి ఎత్తి, దాన్ని నీటినుంచి పీకి, తామరతూడు కుండా నీరు తాగసాగింది.

ఆ సమయంలో ఒక యక్షి నీటి పైకి తల ఎత్తింది. దాని కంఠంలో అత్యద్భుతమైన వజ్రాల హారం ఉన్నది. అది కోతితో, ''ఈ మడుగులోకి అడుగు పెట్టినవాళ్ళు



లోని హారం నాకు ఇచ్చావంటే నేను ఆ రాజులోనూ, అతని మనుషులలోనూ దురాశ రేపి, ఇలాటి హారాల కోసం నీ మడుగులో దిగేలాగు చేస్తాను. నీకు కావలసినంత ఆహారం!'' అన్నది కోతి.

యక్షి ఈ మాటకు సంతోషించి, తన వజ్రాలహారాన్ని కోతికి ఇచ్చి, ''మిత్రమా, ఎలాగైనా వారినందరినీ శీఘ్రంగా ఇక్కడికి తీసుకురా. ఇలాటి భోజనం నేను ఎన్నడూ ఎరగను. ఈ పని చేసి, మన స్నేహాన్ని శాశ్వతం చెయ్యి,'' అన్నది.

కోతి హారాన్ని తీసుకుని రాజప్రాంగణానికి వెళ్ళి, దాన్ని తన మెడలో ధరించి, అందరికీ కనపడేలాగా ఒక చెట్టు నుంచి ఇంకో చెట్టుకు ఎగిరింది. రాజోద్యోగులూ, భటులూ దాన్ని చూసి, ''కోతిరాజా, ఇంతకాలమూ ఏమైపోయావు? నీకా మణిహారం ఎక్కడిది? దాని కాంతి సూర్యకాంతిని మించి ఉన్నదే!'' అన్నారు.

''ఇక్కడికి సమీపంలోనే అరణ్యం మధ్య ఒక రహస్య ప్రదేశం ఉన్నది. కుబేరుడు తన నిధులను ఉంచటానికి అక్కడ ఒక తామరకొలను నిర్మించాడు. ఆదివారం ఉదయం ఎవరు వెళ్ళి అందులో స్నానం చేస్తే, వాళ్ళను కుబేరుడు తన అతిథులుగా భావించి, ఇలాటి హారాన్ని మెడలో వేస్తాడు,'' అని కోతి అన్నది.

నాకు ఆహారం అవుతారు. నువు అందరికన్నా బుద్ధిగలదానివి. నీటిలో అడుగు పెట్టలేదు. నువు నీరు తాగిన పద్ధతి చాలా తెలివిగా ఉన్నది. మెచ్చాను. నువ్వేదైనా కోరు, ఇస్తాను,'' అన్నది.

కోతికి ఒక బ్రహ్మాండమైన ఆలోచన వచ్చి, ''నువు ఒకేసారి ఎన్ని ప్రాణులను తినగలవు?'' అని అడిగింది.

''నీటిలో అడుగు పెట్టాలేగాని ఎన్ని లక్షల ప్రాణులనైనా తినగలను. నీటి బయటికి వస్తే నేను బక్కనక్కకు కూడా సాటిరాను,'' అన్నది యక్షి.

''నాకు చంద్రుడనే రాజూ, అతని పరివారమూ ప్రబల శత్రువులు. నీ మెడ

ఈ వార్త రాజుకు అందింది. అతను వెంటనే కోతిని రప్పించి, "కోతిరాజా, ఈ మాట నిజమేనా? ఆ మడుగులో స్నానం చేసిన వారికి నిజంగా రత్నహారం లభిస్తుందా?" అని అడిగాడు.

"మహారాజా, నా మెడలో హారం చూశారుగదా! ఇలాంటి హారాలు కావా లంటే నా వెంట కొంతమందిని పంపండి. ఆ మడుగు చూపిస్తాను," అన్నది కోతి.

రాజుకు దురాశ పుట్టింది. అతను కోతితో, "ఎవరినో పంపటం దేనికి? నేనే నా బంధుమిత్ర పరివారులతో వచ్చే ఆదివారం మడుగుకు వస్తాను. అంత శీఘ్రంగా కుబేరుడు మా అందరికీ రత్న హారాలు ఇస్తాడంటావా?" అన్నాడు.

"కుబేరుడికి మీరు ఎప్పుడు వెళ్లినా ఒకటే. సముద్ర తీరాన ఇసుక కుప్పల లాగా రత్నహారాలు అక్కడ కుప్పలు పోసి ఉన్నాయి," అన్నది కోతి.

"అయితే మేం రావటం ఖాయం!" అని రాజు ఈ సంతోష వార్తను తన రాణులకు చెప్పటానికి వెళ్లాడు.

ఆదివారం వచ్చింది. ఇంకా తూర్పు తెల్లవారకుండానే రాజూ, రాణులూ, రాజోద్యోగులూ, ఆస్థాన పశువుల వైద్యుడూ, నగర పౌరులందరితోసహా బయలుదేరారు. ముసలికోతి రాజుగారి



ఒడిలోనే కూర్చున్నది. ఇద్దరూ పల్లకీలో ప్రయాణం చేశారు.

దురాశాదేవీ, నీకు నమస్కారం! నీ ప్రేరణచేత ధనవంతులు సైతం పూర్తిగా మతిమాలిన పనులు చేస్తారు. దాటరాని ఎడారులు ప్రవేశిస్తారు. నూరు బంగారు మాడలు గలవాడు వెయ్యి కోరు తాడు. వెయ్యి గలవాడు లక్ష కోరుతాడు. లక్ష గలవాడు రాజ్యం కోరుతాడు. రాజ్యం కలవాడు ప్రపంచాధిపత్యం కోరుతాడు. వార్ధక్యంలో జుట్టు నెరుస్తుంది, పళ్లురాలి పోతాయి. కళ్లు కనబడవు, చెవులు విన బడవు, కాని వాడి దురాశకు ఎప్పుడూ యౌవనమే.

మడుగుచేరినాక కోతి రాజుతో, "సూర్య బింబం దిక్చక్రం మీదికి సగం లేచేసరికి అందరూ మడుగులో ప్రవేశించటానికి సిద్ధంగా ఉండండి. అదే సరి అయిన ముహూర్తం. అందరూ ఒకేసారి నీటిలోకి దిగాలి. వాళ్ళు తిరిగివచ్చినాకనే మీరూ, నేనూ దిగుదాం. నేను మిమ్మల్ని ఒక రహస్య ప్రదేశానికి తీసుకుపోయి, కుబేరుడి చేత అనేక ప్రత్యేక నాణ్యంగల హారాలు ఇప్పిస్తాను," అని కోతి రాజుతో అన్నది. రాజు అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.

సూర్యుడు సగం ఉదయించే సరికి, రాజూ, కోతీ తప్ప అందరూ ఉత్సాహంగా తోసుకొంటూ మడుగులోకి నడిచారు. వాళ్ళు ఎంతకూ తిరిగి రాకపోవటం చూసి రాజు కోతితో, "వీళ్ళు ఎంతకూ రారేం?" అన్నాడు.

కోతి శీఘ్రంగా ఒక మర్రిచెట్టు ఎక్కి, "దుష్టరాజా, నీ ప్రజలనందరినీ ఈ మడుగులో ఉండే యక్షి తినేసింది. నీ గుర్రాల వేదన నివారించటానికి నువు నా వాళ్లనందరినీ నిర్దయగా చంపావు. ఇప్పుడు నా వంతు. నేను నీ వారినందరినీ నిర్దయగా యక్షి పాట్టనపెట్టి, నా కడుపు మంట చల్లార్చుకున్నాను. నా పగ తీరింది. నువ్వు రాజువు గనక నిన్ను వదిలేశాను. నువు బతికినన్నాళ్ళూ ఈ వేదన అనుభవించాలి. దెబ్బకు దెబ్బ! హత్యకు హత్య! అదే మా కోతుల నియమం. మనుషులను మేం అనుకరిస్తాం. నువు నా వంశాన్ని నిర్మూలిస్తే, నేను నీ వంశాన్ని నిర్మూలించాను," అన్నది.

రాజు ఈ మాటలు విని దుఃఖంతో కుమిలిపోయి, నడుచుకుంటూ తిరిగిపోయాడు. రాజు వెళ్లాక యక్షి మడుగులో నుంచి పైకి లేచి, కోతితో, "మంచి పని చేశావు, కోతీ. నువు నీ శత్రువులను హతమార్చావు. రత్నహారం సంపాదించావు. మిత్రుణ్ణి సంపాదించుకున్నావు," అన్నది.

కోతి సంతోషంగా అరణ్యానికి తిరిగి వెళ్లింది.





# భల్లూక మాంత్రికుడు

## 18

[మాయామర్కటుడు, జితకేతరాజును నగరానికి రానున్న ప్రమాదాన్ని గురించి హెచ్చరించాడు. దాడివస్తున్న వాళ్ళలో రాక్షసుడు కూడా వున్నాడని వింటూనే, రాజు మాయామర్కటుణ్ణి ప్రధానమంత్రిగా నియమించాడు. మంత్రి జీవగుప్తుడు, మర్కటుడి పై కత్తి దూశాడు. మర్కటుడు కత్తి లాక్కుని, తన కత్తిని జీవగుప్తుడి పైకి ఎత్తాడు. తరవాత—]

మాయామర్కటుడు కత్తిని మంత్రి జీవగుప్తుడి పైకి ఎత్తటం చూస్తూనే, సభలో హాహాకారాలు బయలుదేరినై. రాజు జితకేతుడు చప్పున ముందుకు వచ్చి, మర్కటుడి చేయి పట్టుకుని, ''మర్కటామాత్యా, తొందరపడకు! సభాభవనంలో నెత్తురు చిందటం, రాజ్యానికి కీడుకలిగిస్తుంది. పైగా, నేనీ జీవగుప్తుడికి శిరశ్ఛేద శిక్ష విధించాను. దానిని అమలు చేయవలసినవాడు నగర ప్రధాన తలారి,'' అన్నాడు.

రాజు యిలా అనగానే మాయామర్కటుడు కత్తిని ఒరలో పెడుతూ, జీవగుప్తుడితో, ''ఓయీ, పాతామాత్యా, ప్రస్తుతానికి బతికిపోయావు! తక్షణం రాజ్యం విడిచిపో.'' అన్నాడు పళ్ళుకొరుకుతూ.

జీవగుప్తుడు, మర్కటుడు కిందపడవేసిన తన కత్తిని తీసుకుని, ఒరలో



పెడుతూ, కోపంగా రాజుకేసీ, మర్కటుడి కేసీ ఓమారు చూసి, "రాజుగారేమో నాకు శిరశ్ఛేద శిక్ష వేశామంటున్నారు; యీ మర్కటుడు దేశం విడిచి పొమ్మంటున్నాడు," అని సభలోవున్న వాళ్ళకేసి తల తిప్పి, "పుర ప్రముఖులారా! నే నిప్పుడేం చేయాలి?" అని అడిగాడు.

సభలోని వాళ్ళకు రాజాజ్ఞను బలపరచాలో, కొత్తగా మంత్రి అయిన మర్కటుడి మాటకు అవుననాలో తోచక గజిబిజి పడుతున్నంతలో సామంతరాజు సూర్యభూపతి, జితకేతరాజుకు నమస్కరించి, "మహారాజా! నా పేరు సూర్యభూపతి. ఈ జీవగుప్తుణ్ణి ప్రస్తుతానికి క్షమించి వదిలెయ్యండి. మీనగరం మీదికి దాడివస్తున్న వాళ్ళలో, ఉదయగిరి రాజు దుర్ముఖుడు కూడా వున్నాడు. ముందు నగరరక్షణకు తగిన ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

రాజు జితకేతుడు, దుర్ముఖుడి పేరు వింటూనే ఉలిక్కిపడి, కొంచెం దూరంగా నిలబడివున్న నగరద్వార కాపలానాయకుడితో, "నువ్వు నగరద్వారం మూయించి, శత్రువుల నుంచి దానిని కాపాడాలి. మన సేనానాయకుడితో సైన్యాలను ఆయత్తం చేసి, కోటబురుజులూ, అగడ్తలూ కాపాడమన్నానని, నా ఆజ్ఞగా చెప్పు," అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అని కాపలానాయకుడు అక్కణ్ణించి బయలుదేరి వెళ్ళాడు.

రాజు జితకేతుడు, సామంతు సూర్యభూపతి కేసి తిరిగి, "ఆ దుర్ముఖరాజును నువ్వెరుగుదువన్నమాట! అతడు పెద్ద సైన్యంతోనే దాడికి బయలుదేరాడా?" అని అడిగాడు.

సూర్యభూపతి దిగులుగా ముఖం పెట్టి, "మహారాజా, ఎంతోకాలంగా ఆ రాజు దుర్ముఖుడి సామంతునైన నేను, అతడు రాజ్యార్హుడుకాదని తిరుగుబాటు చేసి, అతడి నగరాన్ని ఆక్రమించాను. అందుకు

దుర్ముఖుడి సైనికుల్లో చాలామంది నాకు తోడ్పడ్డారు. కాని, మధ్యలో కాళీవర్మ అనే క్షత్రియ యువకుడూ, భల్లూక మాంత్రికుడూ, ఎలుగుబంటు రూపంలో వున్నవాడూ, అడవి దొంగలూ—యిలా నానాకశ్మలం వెధవలంతా గుంపుకట్టుకు వచ్చి, నన్ను కోటలోంచి తరిమేశారు. ఆ దుర్ముఖరాజుకు వున్న ముఖ్యమైన అండ అంతా యీ అలగాజనమే! పెద్ద సైన్యం ఏమీ అతడికి తోడుగాలేదు," అన్నాడు.



సూర్యభూపతి యిలా చెప్పగానే రాజు జితకేతుడు కాస్త బెదురుకుని మాయా మర్కటుడితో, "మర్కటామాత్యా! ఈ సూర్యభూపతి చెప్పుతున్న దాన్నిబట్టి, శత్రువులు కొద్దిమందే అయినా మహా బలవంతులూ, సాహసికులూ అని తోస్తున్నది. మనం కోట వెలపలవున్న నగరరక్షణ మాట తరవాత చూద్దాం, ముందు యీ కోటను రక్షించుకునే మార్గమేమిటో ఆలోచించాలి," అన్నాడు.

అప్పటివరకూ జరుగుతున్నదంతా జాగ్రత్తగా గమనిస్తున్న మాయా మర్కటుడు, రాజు యిలా అనగానే, ఒక చిన్న గంతువేసి, "ఓయ్, రాజా! కోట రక్షణ గురించి మరేం దిగులుపడకు. ఆ భల్లూక మాంత్రికుడూ, వాడి వత్తాసు గాళ్ళూ, సూర్యభూపతి కోటలో ఎలా ప్రవేశించగలిగారనుకున్నావు—ఆ కోట ద్వారాలకు నిప్పుపెట్టి! అందువల్ల నువ్వు ముఖ్యంగా చేయవలసింది, ద్వారరక్షణ. బోధపడిందా?" అన్నాడు.

రాజు బోధపడిందన్నట్టు తల వూపి, సామంతు సూర్యభూపతితో, "ఒకసారి ద్వార రక్షణలు సరిగా చూసుకోక, దొరికిన సింహాసనాన్ని జారవిడిచినవాడివి గనక, నిన్నే కోట ద్వారాలు కాపాడేందుకు నియమిస్తున్నాను. ఆ బాధ్యత సమర్థ వంతంగా నిర్వహించావంటే, నిన్ను నా ప్రథమ సామంతుడుగా చేసి, సత్కరిస్తాను," అన్నాడు.



సూర్యభూపతి, "చిత్తం, మహారాజా!" అని అక్కడినుంచి బయలుదేర బోయేంతలో మంత్రి జీవగుప్తుడు పెద్దగా గొంతెత్తి, ''మరి నా సంగతేమిటి? నా ఉద్యోగం వున్నట్టా, పోయినట్టా?'' అన్నాడు.

ఆ ప్రశ్న వింటూనే మాయామర్కటుడు కీచుమంటూ అరిచి, ''ఓయీ, పాత మంత్రీ! నీ ఉద్యోగం ఎప్పుడో పోయింది. తల మాత్రం మరికొద్ది దినాలపాటు వుంటుంది. తక్షణం యీ సభాభవనం నుంచి బయిటికి పో!'' అన్నాడు.

ముందు సూర్యభూపతీ, అతడి వెన్నంటి మంత్రి జీవగుప్తుడూ, కొంచెం వెనకగా సభలోని పురప్రముఖులూ బయిటికి నడిచారు. అలా అందరూ భవనం నుంచి, దాని ముందున్న ఆవరణలోకి పోగానే, వెనకనుంచి మాయామర్కటుడు వేగంగా భవనం మెట్ల దగ్గిరకు వచ్చి, కత్తి పైకెత్తి పట్టుకుని, తోకను గిరగిరా గాలిలో తిప్పుతూ, ''నా మంత్రదండాన్ని యింతకుముందు ఎలుగుబంటి ఆట దగ్గిర ఎవరో దొంగిలించారు. అది తిరిగి తెచ్చిన వారికి జితకేత రాజుగారు అర్ధరాజ్యంతో పాటు తమ కుమార్తెను కూడా యిచ్చి చేస్తారు,'' అన్నాడు.

మర్కటుడి మాటలు వింటూనే అందరూ ఆశ్చర్యపడుతూ నిలబడిపోయారు. ముందుగా మంత్రి జీవగుప్తుడు వికటంగా నవ్వి, ''ఈ మర్కటుడికి రాజుగారికి ఆడపిల్ల కాదుగదా, అసలు సంతానమే లేదన్న సంగతి తెలిసినట్టు లేదు,'' అన్నాడు.

మంత్రి యిలా అనగానే అందరూ పెద్దగా నవ్వారు. అంతలో అక్కడికి రాజు జితకేతుడు వచ్చాడు. మాయామర్కటుడు ఆయన కేసి కోపంగా చూస్తూ, ''ఓయ్, రాజా, నువ్వేమన్న రాజువి! అసలు నీకు సంతానమే లేదా?'' అని అడిగాడు.

''మర్కటామాత్యా, ఆ సంగతి తరవాత చెబుతాను. ముందు ఆ మంత్ర

దండం నీకు అంత ముఖ్యమా? అది లేకుండా శత్రువులను జయించలేవా?'' అని అడిగాడు రాజు.

''ముఖ్యమా! ఏం ప్రశ్న రాజా? ఆ మంత్రదండం పట్టినవాడికి అసాధ్యం అంటూ, యీ లోకంలో ఏమీ వుండదు. నీ సింహాసనాన్నే కాక, నీ ప్రాణాలను కూడా అది కాపాడగలదు.'' అన్నాడు మర్కటుడు.

వెంటనే రాజు చేఎత్తి, ''నాకు కుమార్తె లేదని ఎవరూ సంశయించనక్కరలేదు. ఒక కన్యను దత్తు తీసుకుని అయినాసరే, అర్ధరాజ్యంతోపాటు, ఆ మంత్రదండం తెచ్చినవాడికి యిచ్చి వివాహం చేస్తాను,'' అన్నాడు.

ఆ మాటలకు అక్కడ వున్నవాళ్లందరూ హర్షధ్వానాలు చేశారు. అంతకుముందు ఆటవికుడి ఎలుగుబంటి ఆట చూడటానికి వచ్చిన జనంలో కొందరు దూరంగా నిలబడి వున్నారు. వాళ్ళల్లో బైరాగి దుస్తులు ధరించి వున్న యిద్దరు యువకులు, రాజు చెప్పినది వింటూనే మతిపోయినవాళ్ళలా ఎగిరి ఒక గంతు వేశారు. వాళ్ళల్లో ఒకడు జోలెలో చేయిపెట్టబోయేంతలో, రెండవవాడు అతణ్ణి వారిస్తూ, ''ఒరే, ఉపశిష్యా, తొందరపడకు! ముందు మన గురువుగారి అభిప్రాయం కనుక్కోవటం అవసరం,'' అన్నాడు.

ఆ వెంటనే బైరాగి యువకులిద్దరూ అక్కణ్ణించి బయలుదేరారు. పుర



ప్రముఖులు జితకేతరాజుకు, మంత్ర దండం తెచ్చినవాడికి యివ్వనున్న బహుమానం గురించి, నగరంలో చాటింపు వేయించటం అవసరం అని సలహా యిచ్చి వెళ్ళబోతున్నంతలో, రివ్వుమంటూ ఒక బాణం కోట గోడల పైనుంచి ఎగిరి వచ్చి, వాళ్ళ మధ్య పడింది.



జనంలో కొందరు కిందపడిన బాణాన్ని తీయబోతున్నంతలో, మాయామర్కటుడు, ''ఆగండి!'' అంటూ కేకపెట్టి, పరుగున పోయి బాణాన్ని తీసుకుని, దానికేసి పరీక్షగా చూసి, వాడి పళ్ళతో కొరికి ముక్కలుగా చేసి, దూరంగా విసిరివేస్తూ, ''ఈ బాణాన్ని ఏం చేశానో, నా శత్రువుల్ని అదే చేయబోతున్నాను,'' అని, ''నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ ఎగిరి గంతువేశాడు.

అంతలో ఒక పెద్ద బండరాయి కోట గోడల మీదినుంచి జుయ్‌ఁమంటూ వచ్చి, రాజభవనం గోడను తాకి దభీమంటూ కింద పడింది. రాతి దెబ్బకు భవనం గోడలో పెద్ద నెర్రె పడింది.

రాజు జితకేతుడు నిలువునా వణికిపోతూ, ''ఇంత పెద్దరాతిని కోట వెలుపలి నుంచి విసరగలిగినవాడు సామాన్యుడు కాడు, రాక్షసుడై వుంటాడు. మర్కటామాత్యా, మానవులమైన మనం, యిలాంటి రాక్షసులతో పోరి, బతకగలమా?'' అన్నాడు.

రాయి పడటం చూస్తూనే పురప్రముఖులతోపాటు, మామూలు జనం కూడా చెల్లాచెదురుగా అక్కణ్ణించి పారిపోయారు. మాయామర్కటుడు, రాజుకు ధైర్యం చెబుతూ, ''ఓయ్, రాజా, భయపడకు! బ్రహ్మపుత్రానదీలోయల్లో యిలాంటి మహాబలశాలులైన రాక్షసుల నెందరినో, మా గురువైన మిథ్యామిశ్రుడు పట్టి బంధించి, ఇంటి నౌకర్లుగా వాడుకుంటున్నాడు.'' అన్నాడు.

రాజు వెలవెలపోతూ, ''అమాత్యా! మరి, ఆయన్ని యిక్కడకు పిలిపించి, శత్రు

ప్రమాదం నుంచి నన్నూ, నా రాజ్యాన్నీ కాపాడగలవా?'' అని అడిగాడు.

ఆ మాటకు మాయామర్కటుడు కీచు కీచు మంటూ నవ్వి, ''ఓయ్ రాజా, నువ్వెంత అమాయకుడివి! తాంత్రిక సార్వభౌముడైన నా గురువు, నీ బోటి బడుగురాజుల్ని రక్షించేందుకు, ఆ నదీ లోయ వదిలి యిక్కడికి వస్తాడనుకుంటు న్నావా? ఆయన తన మంత్ర, తంత్రశక్తు లతో ముందీలోకాన్నీ, తరవాత ఆ పైలోకా లనూ జయించబోతున్నాడు. అందుకు భల్లూకపాదు డనే ఒక తుచ్ఛుడు అడ్డు తగులుతున్నాడు. వాడి శిష్యుడే యిప్పుడు కోటవెలపలనున్న భల్లూక మాంత్రికుడు!" అన్నాడు.

మర్కటుడు యిలా అనగానే జితకేత రాజుకు ఒక అనుమానం కలిగింది. ఎవరో యిద్దరు మాంత్రికులు, ఏవో అపూర్వ శక్తులు సాధించదలిచి, తనబోటి వాళ్ళను అందులో పాచికలుగా వాడు కుంటున్నారు. ఈ మాయామర్కటుడికి, తన సింహాసనం కాపాడటం కన్న, తన శత్రువైన భల్లూక మాంత్రికుణ్ణి హత మార్చటం ముఖ్యకార్యంగా కనబడు తున్నది. అందువల్ల కోటరక్షణ బాధ్యత తానే స్వయంగా నిర్వహించటం అన్ని విధాలా క్షేమం!

రాజు యిలా ఆలోచించి, మాయా మర్కటుడితో, ''మర్కటామాత్యా! మనం కోటగోడల మీదికి పోయి, శత్రు



వులు ఎంత దూరంలోవున్నారో చూడటం అవసరం. సైనికుల్ని కూడా తగు జాగ్రత్తలో వుండవలసిందిగా హెచ్చరించవలసివుంది,'' అంటూ దాపులనున్న కోట బురుజు కేసి బయలుదేరాడు.

మాయామర్కటుడు, ''అయ్యో, నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ పెద్దగా కేకపెట్టి, రాజును అనుసరించాడు.

జితకేత రాజూ, మాయామర్కటుడూ కోటగోడల మీదినుంచి, దాని ముందున్న మైదాన ప్రదేశం కేసి చూశారు. దిగువున గుర్రం మీద కాళీవర్మా, ఎనుబోతు మీద భల్లూక మాంత్రికుడూ, ఏనుగు మీద తలారిభల్లూకుడూ, రాక్షసుడు ఉగ్రదండుడూ—మరి కొందరు సైనికులూ వాళ్ళ కంటబడ్డారు.

రాజు వాళ్ళను చూస్తూనే నిలువెల్లా వణికిపోతూ, ''అమాత్యా, మిగతా వాళ్ల సంగతి కేంగాని, ఆ రాక్షసుణ్ణి చూస్తేనే, నా గుండె నీరైపోతున్నది. వాణ్ణి జయించటం మానవసాధ్యమేనా?'' అన్నాడు.

''మానవసాధ్యం కానిదంతా మంత్రసాధ్యం అన్నారు, పెద్దలు. అలా మంత్రసాధ్యం కూడా కానిది తంత్రసాధ్యం అన్నారు, పండితులు. బాబోయ్, నామంత్రదండం ఎక్కడ?'' అని కీచుమంటూ ఎగిరి గంతువేశాడు మాయామర్కటుడు.

మర్కటుడి అరుపువిన్న ఆటవికుడు ఏనుగు మీద లేచి నిలబడి, బాణాన్ని అతడి కేసి గురిచేస్తూ, ''ఒరే, కోతికుంకా! ఇదుగో, నీ మంత్రదండం బాణంరూపంలో వస్తున్నది!'' అంటూ బాణాన్నివదిలాడు. అది జుయ్ఁమంటూ వచ్చి మర్కటుడి మోకాలికి తగిలింది.

బాణందెబ్బ తింటూనే మాయామర్కటుడు వెల్లకిలాపడి, ''తాంత్రిక గురో!'' అంటూ చప్పున లేచి నిలబడి, బాణాన్ని రెండు చేతులతో వడిసిపట్టుకుని బయటికి లాగి, ''ఒరే, యీ భ్రాంతిమతిని మీ బాణాలు ఏం చేయగలవు?'' అంటూ బాణాన్ని కాళీవర్మా, భల్లూకమాంత్రికుల కేసి విసిరివేశాడు. —(ఇంకా వుంది)






# మాట విలువ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, " రాజా, నీ లాటి రాజులు కొందరికి విలువల తార తమ్యాలు తెలియవు. రాజ్యపాలన చేసి, సుఖంగా విశ్రాంతి తీసుకోవలసిన నువ్వు ఈ నిశిరాత్రి నానా అగచాట్లూ పడుతున్నావు. ఇలాగే చంద్రగిరిరాజు ఒక అనాగరికుడి చేత నానా మాటలూ పడి, ఒక మహాపండితుడు మాటవరసగా అన్న మాట సహించలేకపోయాడు. శ్రమ తెలియకుండా నీకు అతని కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చంద్రగిరి రాజుకు కవులన్నా, పండితులన్నా చాలా అభిమానం. ఆయన ఆస్థానంలో కవి, పండితులు చాలామంది

## బేతాళ కథలు



ఉండేవారు. వారందరిలోకీ అగ్రగణ్యుడు ధనంజయుడు. అతనంటే రాజుకు ఎంతో గౌరవం. ఆ కారణంగా ధనంజయుడికి రవంత గర్వం ఉండేది.

రాజు అప్పుడప్పుడూ మారువేషంలో దేశసంచారం చేస్తూండేవాడు. ఒకసారి అలా సంచారం చేస్తూ రాజు పెద్ద ప్రమాదాన్ని ఎదుర్కొనేసరికి ఒక గొర్రెల కాపరి రాజును రక్షించాడు. రాజధానికి తిరిగిరాగానే రాజు తన మనుషులను పంపి, ఆ గొర్రెల కాపరిని సకల మర్యాదలతోనూ రాజధానికి రప్పించాడు.

సభలోకి అడుగుపెట్టగానే గొర్రెల కాపరికి మతిపోయినట్టయింది. కాని, రాజు సింహాసనం మీది నుంచి దిగి వచ్చి, "గుర్తున్నదా! నువు నా ప్రాణం కాపాడావు. నీకు సన్మానం చెయ్యటానికి పిలిపించాను," అనేసరికి గొర్రెల కాపరి రాజును గుర్తుపట్టి, "ఏమిటీ? నువు రాజువా? నిన్ను నువు కాపాడుకోలేవు గాని, ఈ సింహాసనం మీద కూర్చుని మమ్మల్నందర్నీ ఏలుతున్నావా?" అన్నాడు ఆశ్చర్యంగా.

వాడి మాటలకు కోపం వచ్చి రాజుగారు ఏం చేస్తాడో నని సభలో అందరూ హడలిపోయారు. రాజు మాత్రం ఏమీ చలించకుండా, "నీ సందేహం సరి అయినదే! ఒక్కొసారి పరిస్థితులు అనుకూలించక ఎంతటి శక్తిమంతుడైనా బలహీనుడైపోతాడు. ఈ దేశపు రాజును కాపాడే అవకాశం రావటం నీ అదృష్టం!" అంటూ వాడికి వెయ్యి బంగారు కాసులు బహుమతి ఇప్పించాడు.

గొర్రెల కాపరికి కొంతసేపు నోట మాట రాలేదు. వాడు జంకుతూ డబ్బు తీసుకుని, "ఈసారి ఊళ్ల మీద తిరిగేటప్పుడు కాస్త జాగ్రత్తగా మసలుకో! పనీపాటా గలవాణ్ణి, అన్నప్పుడల్లా నిన్ను కాపాడటానికి నాకు తీరిక ఉండదు," అన్నాడు.

ఈమాటకు రాజు మరింత గట్టిగా, విరగబడి నవ్వాడు. తమ రాజుగారి సహనశక్తి చూసి సభికులందరూ ఆశ్చర్యపోయారు.

ఈ సంఘటన జరిగినప్పటినుంచీ ధనంజయుడికి మనసులో ఒక విధమైన బాధ పట్టుకున్నది. రాజు గొర్రెలకాపరిని ఆదరించి, సన్మానించటం వరకూ అతను అర్థంచేసుకోగలిగాడు. కాని అంత అనాగరికుడు తనను బహిరంగ సభలో అంత తేలికచేసి మాట్లాడితే రాజు ఎలా సహించాడు? అలాటివాడు తనకిచ్చే గౌరవానికి విలువ ఏమిటి?

గొర్రెల కాపరికి రాజు దృష్టిలో ఉన్న విలువ తనకు ఉన్నదీ, లేనిదీ తెలుసుకోవాలని ధనంజయుడు తహతహలాడిపోయాడు. సభలో ఏదో చర్చ జరుగుతూండగా అతనికి తన అనుమానం తీర్చుకునే అవకాశం దొరికింది. రాజుగారు ఒక సంశయం వెలిబుచ్చిన మీదట ధనంజయుడు, "పరమ మూర్ఖుడికి కూడా రాని ఈ సందేహం తమకు ఎలా కలిగిందో తెలియకుండా ఉన్నది, ప్రభూ!" అనేశాడు.

రాజులో కలిగిన మార్పు వర్ణనాతీతం. ఆయన కళ్ళు చింతనిప్పుల్లా అయాయి. ముఖం జేవురించింది. మరుక్షణమే రాజు సభ చాలించి, లేచిపోయాడు.

మర్నాడు ధనంజయుడికి ఆస్థానపండితుడి పదవి ఊడింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, చంద్రగిరి రాజు ప్రవర్తనకు అర్థం ఉన్నదా? గొర్రెల కాపరి తనను సూటిగా అవమానిస్తే ఆగ్రహించకపోగా ఆనందిం



చిన రాజు, తన గౌరవానికి ఎంతో పాత్రుడైన అస్థాన పండితులలో అగ్రగణ్యుడు మాట సందర్భంగా దూషణ స్ఫురింపజేశాడని అంతగా ఎందుకు ఆగ్రహించాడు ? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు ప్రవర్తనకు అనేక సమర్థన లున్నాయి. మొదటి సంగతి, ప్రాణదాత తండ్రితో సమానుడు. అతనికి మందలించే హక్కున్నది. గొర్రెల కాపరి రాజును మందలించాడే గాని అవమానించుతున్నా ననుకోలేదు. పైన వాడి మాటలలో హాస్యం ఉన్నది. సభికులలోకెల్లా రాజుతో చులకనగా మాట్లాడే అధికారం హాస్యగాడికి ఉన్నది. ఆ విధంగా కూడా గొర్రెలకాపరి సమర్థనీయుడు. మూడో సంగతి, గొర్రెల కాపరికి రాజసభలో మతిపోయింది. ఎలా ప్రవర్తించాలో తెలీదు. సాధ్యమైనంత వరకు సహజంగా ప్రవర్తించాలని ప్రయత్నించాడు. వాడి సహజప్రవర్తన కొంత మొరటుగా ఉంటుంది. తనను సన్మానించమని వాడై కోరలేదు. సన్మానించాను గదా, వాడు నాగరికుడి లాగా ప్రవర్తించాలి అని రాజు అనుకోవటం అక్రమం అవుతుంది. ఇక చిట్టచివరి సంగతి, గొర్రెలకాపరి మాటలకు ఎవరూ ఎటువంటి విలువా ఇయ్యరు. వాడి మాటలను బట్టి రాజుగారిని గురించి సభికుల అభిప్రాయాలు మారవు. వారిలో కొందరు ఆగ్రహించారు కూడా. కాని అస్థానపండితుడి మాటకు అందరూ విలువ ఇస్తారు. మాటవరసకే అయినా ధనంజయుడు రాజును అవమానించాడు. రాజు దానిని సహించినట్టయితే మర్నాటినుంచీ సభికులలో ఆయన పట్ల గౌరవం నిలవదు. అందుచేత రాజు ధనంజయుణ్ణి వెళ్ళగొట్టటం న్యాయమే!'' అన్నాడు

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# వింత నియమం

పూర్వం సింధుదేశాన్ని జయసింహుడు పరిపాలించేటప్పుడు అతని ఆస్థానానికి ఒక సంగీత విద్వాంసుడు వచ్చి, తనకు కొలువు ఇయ్యమని కోరాడు.

"మాకు ఆస్థాన సంగీత విద్వాంసులు చాలామంది ఉన్నారు. కొత్తవారిని చేర్చుకునే ఆలోచన ప్రస్తుతం లేదు," అన్నాడు జయసింహుడు.

విద్వాంసుడు ఆ రోజు వెళ్ళి, మర్నాడు సభకు వచ్చి, "నేను సంగీత విద్వాంసుణ్ణి. మీ ఆస్థానంలో ఉండగోరి వచ్చాను." అని మళ్ళీ రాజు జయసింహుడితో అన్నాడు.

"మా ఆస్థానంలో ఇప్పుడు సంగీత విద్వాంసులు అవసరంలేదు. మీరు వెళ్ళవచ్చు," అన్నాడు జయసింహుడు.

కాని ఆ విద్వాంసుడు రోజూ వచ్చి, అదే ప్రథమం అయినట్టుగా రాజుకు తన కోరిక చెబుతూ వచ్చాడు. రాజు అతని కోరికను నిరాకరిస్తూ వచ్చాడు.

ఇలా చాలా రోజులు గడిచిన మీదట రాజుకే తన ప్రవర్తన అవమానకరం అనిపించింది. తన ఆస్థానంలో సంగీత విద్వాంసుడుగా ఉండాలని ఆ మనిషి అంత ఓర్పుతో అడుగుతూ ఉంటే, అతనేదో అర్ధరాజ్యం అడిగినట్టుగా తాను పదే పదే నిరాకరించటం అసహ్యమనిపించింది. అందుకని ఒక రోజు విద్వాంసుడు తన కోరిక వెలిబుచ్చినప్పుడు జయసింహుడు, "మీరు అంతగా అడుగుతున్నారు గనక, మీ గానం మా విద్వాంసులకు వినిపించండి. వారు ఒప్పుకుంటే, మిమ్మల్ని ఆస్థాన విద్వాంసులలో ఒకడుగా వేసుకుంటాను," అన్నాడు.

"మహారాజా, నా కొక నియమం ఉన్నది. నేను నా కిష్టమైనప్పుడే గానం

ధరణీప్రగడ వెంకటశేషగిరిరావు

చేస్తాను, ఒకరు కోరినప్పుడు చెయ్యను. అది తమకు పూర్తిగా సమ్మతమైతేనే నన్ను తమ కొలువులో చేర్చుకోండి,'' అన్నాడు విద్వాంసుడు.

''ఇలాటి నియమం గల విద్వాంసుడికి మా ఆస్థానంలో స్థానం లేదు!'' అన్నాడు రాజు పరుషంగా.

విద్వాంసుడు వెళ్ళిపోయడు, కాని మర్నాడు మళ్ళీ వచ్చాడు. రాజు అతనికి ఆస్థాన విద్వాంసుడి పదవి మళ్ళీ నిరాకరించాడు.

ఇలా మరికొంతకాలం గడిచింది.

అకస్మాత్తుగా జయసింహుడికి ఒక ఆలోచన వచ్చింది. ఆ విద్వాంసుడి మనసులో ఏదో ఆలోచన ఉండాలి. అతన్ని శాశ్వతంగా వదిలించుకోవడం ఏ మంత కష్టంకాదు, కాని అలా చేస్తే ఆ విద్వాంసుడి మనసులో ఉన్నదేమిటో ఎప్పటికీ తెలియదు.

ఇలా అనుకుని జయసింహుడు ఒక నాడు ఆకస్మికంగా, సభికులందరూ నిర్ఘాంతపోయేటట్టు, "ఇవాళనుంచీ మీరు ఆస్థాన విద్వాంసుడుగా ఉండవచ్చు. మీకు నివాసమూ, వేతనమూ, అవసరం అయిన ఇతర సదుపాయాలూ ఏర్పాటు చేస్తాను," అనేశాడు.

అందరూ ఆశ్చర్యపడ్డారు గాని, విద్వాంసుడు మాత్రం ఏమీ ఆశ్చర్యపడలేదు. అతను ఆ రోజే జయసింహుడి కొలువులో చేరాడు.



రాజు చేసిన ఈ పని ఎవరికీ నచ్చలేదు. కాని ఈ కొత్త విద్వాంసుడు అపర నారదుడు కాబోలు ననుకుని చాలామంది సరిపెట్టుకున్నారు. అయితే నెలలు గడుస్తున్నా కొత్త విద్వాంసుడు పాడిన పాపాన పోలేదు.

రాజుగారికి కొడుకు పుట్టాడు. దేశమంతటా వెర్రిగా వేడుకలు చేసుకున్నారు. రాజభవనం పదిరోజులపాటు నృత్యగాన వినోదాలతో మారుమోగింది. ఆస్థాన సంగీత విద్వాంసులూ, ఇతర విద్వాంసులూ పాడారు. కొత్త విద్వాంసుడు మాత్రం పాడలేదు. రాజు మనస్సు చివుక్కుమన్నది. ఇంతటి వేడుకల మధ్య ఈ విద్వాంసుడికి పాడాలనిపించకపోతే మరెప్పుడు అనిపిస్తుంది? నువు కూడా పాడరాదా అని కొత్త విద్వాంసుణ్ణి ఇతరుల చేత అడిగించాడు రాజు. విద్వాంసుడు పలకలేదు. మంత్రి దగ్గిరనుంచీ వచ్చి అడిగితే, "ఇప్పుడు కాదు, తగిన సమయం వస్తే ఎవరూ అడగకుండా నేనే గానం చేస్తాను." అన్నాడతను.

అతన్ని పదవి నుంచి తొలగమందామని రాజుకు ఎన్నోసార్లు నోటిదాకా వచ్చింది. కాని ఆ విద్వాంసుడి వైఖరిలో ఏదో రహస్యం ఉన్నది. దాన్ని తెలుసుకు తీరాలన్న ఉద్దేశం రాజును నిగ్రహించింది.

అయిదేళ్ళు గడిచాయి.

కొత్త విద్వాంసుడు ఈ కాలంలో ఒక్కసారి కూడా పాడలేదు.



అకస్మికంగా రాజకుమారుడికి ఏదో విషజ్వరం వచ్చింది. ఎందరో వైద్యులు మందులిచ్చినా వ్యాధి ముదురుతూనే వచ్చింది. అందరూ ఆశ వదలుకున్నారు. రాజకుమారుడి ప్రాణాలు ఏ క్షణాన అయినా పోయేలాగున్నాయి. అందరూ రాజకుమారుడి మరణశయ్యా చుట్టూ మూగి ఉన్నారు.

సరిగా ఆ సమయంలో సంగీత విద్వాంసుడు తన వీణతో వచ్చి ఎడంగా కూర్చుని పాడటం ప్రారంభించాడు!

"ఛీ ఛీ! పాడక పాడక ఇప్పుడా పాడతాడు?.... పుట్టిననాడు పాడలేకపోయాడు గాని అఖరు క్షణంలో, వెళ్ళిపోభోయేటప్పుడు, రాజకుమారుడికి పాట వినిపిస్తున్నాడు!" అంటూ రకరకాలుగా అనేక మంది సంగీత విద్వాంసుణ్ణి రహస్యంగా విమర్శించారు.

కాని విద్వాంసుడి పాట అందరి మనసులనూ మత్తుమందు లాగా ఆవరిస్తున్నది. వాళ్ళు రాజకుమారుడి జబ్బునూ, రానున్న చావునూ మరచిపోతున్నారు. తాము ఎక్కడ ఉన్నదీ వాళ్ళకు తెలియకుండా పోతున్నది.

జయసింహుడు నిద్రలేచినవాడల్లే తన కొడుకు కేసి చూశాడు. మరణశయ్య ఖాళీగా ఉన్నది. రాజు మరింత ఆందోళన పడపోతూ చుట్టూ ఉన్నవారిని చూశాడు.

చిత్రం! రాజకుమారుడు అందరితో బాటు కూర్చుని, మైమరపుతో సంగీతం వింటున్నాడు!

ఉన్నట్టుండి సంగీతం ఆగిపోయింది. విద్వాంసుడు తన వీణ తీసుకుని బయటికి నడిచాడు.

రాజకుమారుడు చచ్చి బతకటం అందరి దృష్టినీ ఆకర్షించింది. ఎవరూ విద్వాంసుణ్ణి గురించి ఆలోచించలేదు.

తరవాత రాజు విద్వాంసుడికి పెద్ద జాగీరు ఇచ్చి, గొప్పగా సత్కరింతామనుకున్నాడు. కాని ఆ విద్వాంసుడు ఏమయాడో ఎవరికీ తెలియలేదు.





# మనిషికి కావలసినది

అవంతీ రాజ్యంలో వినోదుడు అనేవాడు రాజుగారి కొలువులో చిన్న ఉద్యోగంలో చేరాడు. అతని తండ్రి రాజుగారి కొలువులో ఉద్యోగం చేస్తూ మరణించడం వల్ల వినోదుడికి ఆ ఉద్యోగం దొరికింది. చాలాకాలం అతను పెళ్లి చేసుకోలేదు. కారణం, తాను పెద్ద ఉద్యోగంలో ఉండి, తన కాబోయేభార్య దృష్టిలో ఘరానా మనిషిగా కనిపించాలని అతని ఉద్దేశం.

అయితే తల్లి పోరగా, పోరగా, వినోదుడు పెళ్లికి ఒప్పుకున్నాడు. ఒక పేదరైతు కూతురు చంద్ర అతనికి భార్య అయింది. ఆమె అందంలోనే గాక, గుణంలో కూడా గొప్పది. పేదకుటుంబం నుంచి వచ్చిందేమో, ఆమెకు పొదుపూ, ఇతరులకు మర్యాద చూపటమూ చక్కగా తెలుసు. ఆమె భర్త దగ్గిరా, అత్తగారి దగ్గిరా అణకువగా మసలుకునేది.

కాని భార్య దగ్గిర గొప్పలకుపోయి వినోదుడు ధారాళంగా డబ్బు ఖర్చు పెటుతూ వచ్చాడు. భార్యను మెప్పించు తున్నాననుకుని లేనిపోని గొప్పలకుపోయి అతను అప్పుల పాలయాడు.

చంద్రకు తన భర్త సంపాదన ఎంతో తెలుసు, కాని అతను సంపన్నుడు కాదన్న సంగతి జ్ఞాపకం చెయ్యకుండా, ఆమె అనవసరపు ఖర్చులు తగ్గించమని భర్తను కోరేది. పొదుపుగా ఉండటం అవమానంగా భావించి వినోదుడు, ''అంత పీనాసిగా బతకవలసిన కర్మ మనకేం పట్టింది? మన హెదాకు తగినట్టు ఉండవద్దా?'' అని భార్యతో అనేవాడు.

అయినా అతన్ని అప్పులు బాధిస్తూ ఉండటం వల్ల, ఇంకా మంచి ఉద్యోగం కోసం ఎంతో ప్రయత్నించాడు. కాని ఆ ప్రయత్నాలేవీ కలిసిరాలేదు.

బొమ్మిడి అచ్చారావు



ఇలా ఉండగా వినోదుడి మేనమామ తన చెల్లెలినీ, మేనల్లుణ్ణీ చూడవచ్చాడు. ఆయన రాచకొలువులో పెద్ద ఉద్యోగి. ఆయన తలచుకుంటే తనకు మంచి ఉద్యోగం ఇప్పించగలడన్న ఆశతో వినోదుడు ఆయనకు తన గోడు చెప్పుకున్నాడు.

వినోదుడి మాటలు విని మేనమామ ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే, వినోదుడి ఉద్యోగం చచ్చుదేమీ కాదు; అతని అర్హతలకు మించినదే. అంతేగాక వినోదుడి రాబడి కుటుంబ ఖర్చులకు హాయిగా సరిపోతుంది. కావాలంటే అందులో కొంత వెనక వేసుకోవచ్చు కూడా. అంతేకాదు, ఆ ఉద్యోగంలో సమర్థత చూపితే మంచి భవిష్యత్తు ఉన్నది. ఇది తెలిసిన మేనమామ వినోదుడి అవివేకానికి జాలిపడ్డాడు.

"చూడు, వినోదా! ముందు నీ ఉద్యోగం మీద గురీ, గౌరవమూ ఉండాలి. అప్పుడే ఆ ఉద్యోగంలో నువు రాణించగలుగుతావు. పై అధికారులు నీ ప్రతిభ గుర్తించినట్టయితే నీకు మేలు కలుగుతుంది. ముందు ఈ జీతంతో తృప్తి పడటం నేర్చుకో." అన్నాడు మేనమామ.

వినోదుడికి ఈ మాటలు రుచించలేదు. తనకు సహాయం చెయ్యకుండా తప్పించుకోవటానికి తన మేనమామ ఇదంతా చెబుతున్నాడని అతను అపోహపడ్డాడు. ఈ సంగతి మేనమామ పసిగట్టాడు.

"నువు ఎలాంటి ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నావు?" అని ఆయన వినోదుణ్ణి అడిగాడు.

"కోశాధికారి పదవి గాని, మండలాధికారి పదవి గాని అయితే హోదాకు హోదా, ఆదాయానికి ఆదాయమూ బాగా ఉంటాయి," అన్నాడతను.

మేనల్లుడి గొంతెమ్మ కోరికలు చూసి మేనమామకు నవ్వూ, కోపమూ కూడా కలిగాయి.

"సరే, రేపు నాతో రా. కోశాధికారి నాకు తెలుసు. అతని ద్వారా ప్రయత్నం చేదాం," అన్నాడాయన.

వినోదుడు మర్నాడు తన మేనమామ వెంట రాజధానికి బయలుదేరాడు. ఇద్దరూ కలిసి కోశాధికారి దగ్గిరికి వెళ్ళారు. కోశాధికారితో ఏకాంతంగా మాట్లాడిన తరవాత, మేనమామ వినోదుణ్ణి ఆయనకు పరిచయం చేశాడు.

కోశాధికారి వినోదుణ్ణి నఖశిఖపర్యంతమూ పరీక్షించి, తల పంకించి, అతను చేస్తున్న ఉద్యోగం గురించి అడిగి తెలుసుకున్నాడు.

ఆయన వినోదుడితో, ''నీ ఆశయం మంచిదే. కాదనను. అయితే ఈ కోశాధికారి పదవి నువు అనుకున్నంత సుఖమైనదేమీ కాదు. కత్తి మీద సాము లాంటిది. ధనాగారంతో పని! ఏ మాత్రం తేడాపాడాలొచ్చినా రాజదండన తప్పదు. ఈ పదవి నిర్వహించటానికి తెలివితేటలే కాదు, గుండె ధైర్యమూ, అనుభవమూ కూడా కావాలి!'' అన్నాడు.

వినోదుడికి ఈ మాటలు ఏ మాత్రం రుచించలేదు.

కోశాధికారి ఇంకా ఇలా అన్నాడు:

''నన్నీ కోశాధికారి పదవి అకస్మాత్తుగా వరించలేదు. ఈ పదవిలోకి రాకముందు నేను దివాణంలో గంటలు కొట్టాను; తరవాత ద్వారపాలకుడుగా పనిచేశాను; ఆ తరవాత కోట కాపలాదారుల్లో ఒకడుగా ఉన్నాను; అటుతరవాత కోశాగార రక్షకుణ్ణి అయాను. రాజుగారు నన్ను ఎన్నోసార్లు అగ్నిపరీక్షలకు గురిచేసి, అన్నిటికీ



తట్టుకున్నాక, ఈ కోశాగార పదవి అనుగ్రహించారు. ఎన్నో మెట్లు ఎక్కకుండా పై అంతస్థుకు ఎగరగలమా ?''

వినోదుడికి ఇదంతా అధిక ప్రసంగంగా తోచింది. అతని ముఖకవళికలు మేనమామ గమనిస్తూనే ఉన్నాడు. ఇద్దరూ కోశాధికారి వద్ద సెలవు తీసుకుని, అక్కడి నుంచి బయలుదేరారు.

''ఈయన మాటలకేం గాని, మండలాధికారి నా స్నేహితుడే. అతన్ని కూడా కలుద్దామా ?'' అన్నాడు మేనమామ.

వినోదుడిలో మళ్ళీ ఆశ చిగురించింది.

ఇద్దరూ మండలాధిపతి వద్దకు వెళ్ళే దారిలో ఒక పదిమంది యువకులు వాళ్ళకు ఎదురయారు. వినోదుడి మేనమామ వాళ్ళను ఆపి, ''ఎక్కడికి, బాబూ, మీరంతా గుంపుగా పోతున్నారు ?'' అని అడిగాడు.

వారిలో ఒకడు ఇలా అన్నాడు :

''మేం నిరుద్యోగులయిన విద్యావంతులం. మా తెలివితేటలూ, విద్యా మా కింత తిండి పెట్టలేకపోయాయి. రాజధానిలో కూడా మా విద్యకు గుర్తింపు లేకపోయాక, మేం ఇంకా ఇక్కడ దేనికి ? పల్లెప్రాంతాలకు పోయి భూమి దున్నుకు బతుకుతాం.''

వాళ్ళు ఉత్సాహంగా ముందుకు సాగిపోయారు.

వినోదుడిలో ఆకస్మికంగా మార్పు కలిగింది. అతని భ్రమలన్నీ ఒక్కసారిగా తొలగిపోయాయి.

''మండలాధిపతి నివాసం దగ్గిరలోనే ఉన్నది. ఆయనను కలుసుకుందాం, పద !'' అన్నాడు మేనమామ.

''ఇక ఎవర్నీ కలుసుకో నవసరం లేదు, మామా ! నాకు ఉన్న ఉద్యోగం చాల్లే ! శక్తివంచన లేకుండా ఇందులోనే పైకి రావటానికి ప్రయత్నిస్తాను. నీకు అనవసరంగా శ్రమ ఇచ్చాను,'' అన్నాడు వినోదుడు.

అతని మేనమామ తన లోనే నవ్వుకున్నాడు.





# శుక్రుడు

దానవులకు గురువుగా ప్రసిద్ధి చెందిన శుక్రుడు భృగువు కొడుకు. శుక్రుడు బృహస్పతితోబాటు బృహస్పతి తండ్రి అయిన అంగిరసుడి వద్దనే చదువుకున్నాడు. అంగిరసుడు ఈ ఇద్దరి మధ్యా పక్షపాతం చూపటంచేత, శుక్రుడు అంగిరసుణ్ణి విడిచిపెట్టి, గౌతముడి వద్దకు వెళ్ళి, తనకు చదువు చెప్పమన్నాడు.

గౌతముడు ఏ కారణంచేతనో శుక్రుడికి చదువు చెప్పక, శివుణ్ణి ఆశ్రయిస్తే అన్ని విద్యలూ వస్తాయని శుక్రుడితో అన్నాడు. శుక్రుడు అంత పనీ చేసి, శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, శివుడి నుంచి "మృతసంజీవని" విద్య నేర్చుకున్నాడు.

తరవాత శుక్రుడు దానవులకు గురువై, దేవదానవ యుద్ధాలలో చనిపోయిన దానవులను తన మృతసంజీవనితో బతికిస్తూ వచ్చాడు. ఇది దేవతలకు పెద్ద ఆటంకంగా పరిణమించింది. ముఖ్యంగా అంధకాసురుడు అనేవాణ్ణి చంపటం చాలా కష్టమయింది. వాడు బ్రహ్మ నుంచి గొప్ప వరాలు పొందాడు. వాడి కొక దుర్గుణం ఉండేది. వాడు అందమైన స్త్రీలను చెరపట్టేవాడు. ఒకసారి వాడు పార్వతి మీదనే కన్ను వేశాడు. వాణ్ణి చంపాలంటే అన్నిటినీ మించిన ప్రతిబంధకం శుక్రుడి మృతసంజీవని విద్య!

ఆ కారణంచేత శివుడు తాత్కాలికంగా శుక్రుణ్ణి మింగేసి, అంధకాసురుణ్ణి తానే చంపాడు. తరవాత శుక్రుడు శివుడి నుంచి బయటికి వచ్చాడు.

శుక్రుడి మృతసంజీవనీ విద్య దేవతలకు ఇంకా కొన్ని చిక్కులు తెచ్చిపెట్టింది. శుక్రుడి సహాయం దానవులకు లేకుండా చెయ్యటానికి ఇంద్రుడు తన కుమార్తె అయిన జయంతిని శుక్రుడి

వద్దకు పంపాడు. శుక్రుడు జయంతి మోహంలో పడి దానవులకు అందకుండా పోయాడు. వాళ్ళు ఆయనకోసం వెతుకుతూండగా, బృహస్పతి శుక్రుడి రూపంలో వచ్చి, దానవుల మధ్య చేరి, వారి రహస్యాలన్నీ తెలుసుకుంటూ, వారికి నష్టం కలిగించే ఆలోచనలు చెప్పసాగాడు. ఇంతలో శుక్రుడు వచ్చాడు. ఇద్దరు శుక్రులలో అసలు శుక్రుడెవరో తెలుసుకోవటం దానవులకు పెద్ద సమస్య అయింది.

మృతసంజీవని కోసమే దేవతల తరఫున కచుడు వచ్చి శుక్రుడికి శుశ్రూష చేయటమూ, శుక్రుడి కూతురు దేవయాని ఆ కచుణ్ణి ప్రేమించటమూ, దానవులు అనేకసార్లు కచుణ్ణి చంపితే, దేవయాని తండ్రిచేత బతికించుకోవటమూ అందరికీ తెలిసిన కథే. అయితే, ఆ కాలంలోనే మద్యనిషేధం రావటానికి కచుడు కారకుడని చాలామందికి తెలియదు.

ప్రతిసారీ చచ్చిన కచుణ్ణి శుక్రుడు బతికిస్తున్నాడని దానవులు కచుణ్ణ బూడిద చేసి, కల్లులో కలిపి శుక్రుడి చేత తాగించారు. శుక్రుడు బతికించేసరికి కచుడు శుక్రుడి పొట్టలో ఉన్నాడు. శుక్రుడు చావకుండా కచుడు బయటికి రాలేదు. అందుచేత శుక్రుడు అతనికి మృతసంజీవని ఉపదేశించి, అతను బయటికి వచ్చాక, కచుడి సహాయంతో తిరిగి బతకవలసివచ్చింది. ఇంత జరిగాక శుక్రుడు తాగుడు మహాపాపమని శాసించాడు.

''ఒంటికంటి శుక్రాచార్లు'' అన్నది అందరూ అనే మాట. వామనుడు బలి చక్రవర్తిని మూడడుగుల భూమి అడిగినప్పుడు, బలి దానం ఇయ్యటానికి జలకలశం ఎత్తితే, శుక్రుడు ధారకు అడ్డం పడ్డాడు. దర్భతో కలశం కొమ్మును పొడిచారు. అప్పుడు శుక్రుడి కన్ను ఒకటి పోయింది.

పురాణాలలో శుక్రుడి ఘనత ఏమైనా ఆకాశంలో కనిపించే గ్రహాలన్నిటిలోకీ కాంతివంతమైనది శుక్రగ్రహం. గురుగ్రహం కూడా దానితో పోలదు.






# ఆదర్శ శిష్యుడు

పూర్వం అరణ్యంలో ధౌమ్యుడు అనే ముని ఆశ్రమం ఉండేది. అందులో ఆయన శిష్యులు అధ్యయనంతోపాటు గురువుగారికి సేవలు కూడా చేసేవారు.



ధౌమ్యుడి శిష్యులలో ఉపమన్యుడు అనేవాడు గురువుగారి పశువులను కాసేవాడు; పశువులను బీళ్ళకు తోలుకు పోయి, సాయంకాలం ఆశ్రమానికి తెచ్చేవాడు.




ఒక రోజు ధౌమ్యుడు ఉపమన్యుణ్ణి, "నీకు ఆహారం ఏమిటి?" అని అడిగాడు. పశువులు మేసే సమయంలో సమీపంలో ఉండే పల్లెలో భిక్షం ఎత్తి తింటున్నానన్నాడు ఉపమన్యుడు. "నా అనుమతిలేకుండా దాన్ని ఎలా తింటున్నావు?" అని గురువు మళ్ళీ అడిగాడు.



మర్నాడు ఉపమన్యుడు తాను భిక్షం ఎత్తి తెచ్చిన ఆహారం గురువుకు తెచ్చి ఇచ్చాడు. అందులో కొంత గురువు తనకిస్తాడని అతను అనుకున్నాడు. కాని అలా జరగలేదు. అయినా ఉపమన్యుడు రోజూ తన భిక్ష తెచ్చి గురువుకు ఇస్తూవచ్చాడు.



తరవాత ఉపమన్యుడు ఆవుల పాలు పిండి, వాటిని తాగుతూ వచ్చాడు. ఈ సంగతి తెలిసి గురువు, ఆశ్రమంలో పిండగా ఆవుల పొదుగులలో మిగిలిన పాలు దూడల సొత్తు అని చెప్పాడు.



దూడలు ఆవుల వద్ద పాలు తాగగా వాటి మూతులకు అంటిన నురుగును ఉపమన్యుడు తాను తీసుకున్నాడు. కాని ఇది కూడా నిషేధించబడింది. ఎందుకంటే, అతని మీది ప్రేమకొద్దీ దూడలు హెచ్చు నురుగు వదలవచ్చు!



ఆకలి బాధకు తట్టుకోలేక ఉపమన్యుడు ఏవేవో ఆకులు తినసాగాడు. ఏదో ఆకుల రసం కళ్ళలో పడి, అతని కళ్ళు పోయాయి. అతను తడువుకుంటూ ఆశ్రమానికి బయలుదేరాడు.



దారిలో ఉపమన్యుడు ఒక కొనలోపడి, దుర్బలత్వం వల్ల తిరిగి పైకి ఎక్క లేకపోయాడు, సహాయం కోసం అరవలేకపోయాడు. చీకటి పడింది.



గోవులు ఆశ్రమానికి తిరిగి వచ్చాయి. ఉపమన్యుడు లేడు. అతనికేదో ప్రమాదం జరిగిందని గ్రహించి, గురువు అతన్ని వెతుక్కుంటూ బయలుదేరాడు.



# అవీక్షితుడు

అవీక్షితుడు కరంధముడు అనే రాజుకు వీర అనే భార్యయందు కలిగిన కొడుకు. అతను పుట్టినప్పుడు జ్యోతిష్కులు, "దుష్టగ్రహ వీక్షణం ఈ జాతకుడికి లేదు," అన్నారు. ఆ కారణంగా అతనికి అవీక్షితుడు అన్న పేరు పెట్టటం జరిగింది.

కరంధముడి తండ్రి గొప్ప ప్రజాపీడకుడు కావటం చేత, మంత్రులూ, ప్రజలూ అతన్ని రాజ్యం నుంచి వెళ్ళగొట్టి, కరంధముడికి పట్టాభిషేకం చేశారు. తనకు తండ్రి గతే పట్టుతుందేమోనని, కరంధముడు మంత్రులకూ, ప్రజలకూ అమితంగా ధనం ఇచ్చి, బొక్కసం ఖాళీ చేసుకున్నాడు. అందుచేత, చుట్టుపట్లగల రాజులు అతని రాజధానిని ముట్టడించి, అతన్ని అడవులకు తోలేశారు. కరంధముడు సేనలను పోగుచేసి వచ్చి, తిరిగి తన రాజ్యాన్ని గెల్చుకున్నాడు.

అవీక్షితుడు గొప్ప ప్రతిభావంతుడు. వీరా, గౌరీ, సుభద్రా, లీలావతీ, దారికా, మాల్యవతీ, కుముద్వతీ అనే కన్యలు వరసగా స్వయంవరాలలో అతన్ని పరించి, అతనికి భార్యలు అయారు. ఇంతలో విశాల అనే రాజకుమార్తె స్వయంవరం వచ్చింది. అవీక్షితుడు అక్కడికి కూడా హాజరు అయ్యాడు. అప్పటికే అతనంటే అసూయతో ఉన్న ఇతర రాజకుమారులు అతని మీద అధర్మయుద్ధం చేసి ఓడించారు. కాని విశాల ఇతరులను పరించ నిరాకరించింది. స్వయంవరం నిలిచిపోయింది.

ఈలోపల కరంధముడు తన కొడుకు ఓటమి గురించి తెలిసి, సైన్యంతో వచ్చి, అందరినీ ఓడించి, అవీక్షితుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశాడు. విశాల అతన్ని పెళ్లాడటానికి సిద్ధపడింది. అయితే, ఆమె కళ్ళ



గురువు కనుమలో పడిఉన్న శిష్యుడి వద్దకు వచ్చి, జరిగినది తెలుసుకుని, దేవతల వైద్యులైన అశ్వినులను ప్రార్థించమని ఉపమన్యుడికి చెప్పాడు.



ఉపమన్యుడు అలాగే చేశాడు. అశ్వనులు ఇద్దరూ అతని సమీపంలో ప్రత్యక్షమై, అతనికి ఒక రొట్టె ఇచ్చి, "దీన్ని తిను; నీ గుడ్డితనం పోతుంది," అన్నారు. "నా గురువుగారి అనుమతి లేకుండా నేను తినరాదు," అన్నాడు ఉపమన్యుడు.



దేవతలు సంతోషించి ఉపమన్యుణ్ణి అతని గురువు వద్దకు తెచ్చారు. గురువు అనుమతి పొంది ఉపమన్యుడు రొట్టెను తిన్నాడు. వెంటనే అతనికి దృష్టితో పాటు సంపూర్ణారోగ్యం కూడా వచ్చింది. గురువూ, అశ్వనీ దేవతలూ అతన్ని ఆశీర్వదించారు.

ఎదట ఓడిపోయిన కారణంగా అతను ఆమెను పెళ్ళాడటానికి ఒప్పుకోలేదు.

అవీక్షితుణ్ణి తండ్రి ఇంటికి తీసుకు పోయాడు. కాని విశాలనే ప్రేమించి ఉన్న అవీక్షితుడు బ్రహ్మచర్యం అవలంబించాడు. అవతల విశాల ఎలాగైనా అవీక్షితుడే తనకు భర్తగా కావాలని, తండ్రి అనుమతితో అరణ్యానికి పోయి, తపస్సు చేసుకుంటూ ఉండిపోయింది.

అవీక్షితుణ్ణి ఎలాగైనా సంసారంలో దింపాలని అతని తల్లి అతనితో, ''నాయనా, నేను కిమిచ్ఛకవ్రతం పట్టాను. ఎవరు ఏది కోరినా నువు ఇస్తూ ఉండాలి,'' అన్నది. అవీక్షితుడు సరే నన్నాడు. తల్లి వ్రతం ప్రారంభించింది. కొడుకు అడిగినవారికి అడిగినది ఇస్తున్నాడు

అవీక్షితుడి వద్దకు కరంధముడు వచ్చి తనకు మనమణ్ణి ఇయ్యమని కోరాడు. అడిగనది లేదనటానికి లేదు గనక అవీక్షితుడు సంసార జీవితానికి సమ్మతించాడు.

ఒకనాడు అతను వేటకుగాను అరణ్యానికి వెళ్ళాడు. ఇంతలో, ''అవీక్షితుడి భార్యను! రక్షించండి! రక్షించండి!'' అని ఆర్తనాదం వినిపించింది.

అవీక్షితుడు తన చెవులను తానే నమ్మలేక ముందుకు పోయి, ఒక రాక్షసుడికి చిక్కిన స్త్రీని చూసి, రాక్షసుణ్ణి చంపి, ఆమెను విడిపించాడు. రాక్షసుణ్ణి చంపినందుకు అతన్ని మెచ్చుకున్న దివ్యపురుషులు, అతన్ని వరం కోరమన్నారు.

''నా తండ్రికి మనవడు కావాలట. నాకు కొడుకు కావాలి,'' అన్నాడు అవీక్షితుడు.

''ఇక నేం? ఈమెకే కను!" అన్నారు దివ్యపురుషులు.

''నేను విశాలను వరించాను. మరొక స్త్రీకి పిల్లలను కనటం నాకిష్టం లేదు,'' అన్నాడు అవీక్షితుడు.

''విశాల అంటే ఈమే! నీ భార్య కావటానికి తపస్సు చేసుకుంటున్నది.'' అన్నారు దివ్యపురుషులు.







# హరిదాసు మాట

ఒక ఊరి దేవాలయంలో హరికథా కాలక్షేపం జరుగుతున్నది. సందర్భవశాన హరిదాసు, "ఇతరుల సొత్తు అపహరిస్తే, అది అపహరించిన వాళ్ళకు దక్కదు. వాళ్ళు నిశ్చయంగా చెడిపోతారు." అని చెప్పాడు.

ఈ మాటలు ముగ్గురు తోడుదొంగలు విని, "ఈ హరిదాసు ఇంటిలోనే దొంగతనం చేసి, ఇతడి మాట అబద్ధం చేద్దాం," అనుకున్నారు. వాళ్ళ పేర్లు ఇడుంబుడూ, కడుంబుడూ, దుడుంబుడూనూ.

ఒకరాత్రివేళ ముగ్గురూ హరిదాసు ఇంటికి కన్నంవేసి, లోపల ప్రవేశించి, హరిదాసునూ, అతని భార్యనూ కట్టి, నగలూ, డబ్బూ, విలువైన పాత్రలూ మూటగట్టి అక్కడినుంచి బయలుదేరారు.

ఆ రాత్రికి ఆ మూటను ఒకచోట పాతిపెట్టి, దొంగతనం గురించిన అలజడి శాంతించినాక, తాపీగా వచ్చి మూట తవ్వి తీసుకుని పంచుకోవచ్చునని వాళ్ళు నిశ్చయించుకుని, ఊరిబయట ఒక పల్లపు ప్రదేశంలో చిన్న గుంట తవ్వి, మూటను అందులో పూడ్చి, పైన మట్టి కప్పి, అందరూ ఏకంగా పోవటం మంచిది కాదని, తలా ఒకవైపూ వెళ్ళిపోయారు.

దొంగలు ముగ్గురికీ ఒకే ఆలోచన వచ్చింది. అదేమిటంటే, ఎవడికివాడు మిగిలిన ఇద్దరినీ మోసం చేసి, మూటలో ఉన్నదంతా కాజెయ్యాలనుకున్నాడు.

ఇడుంబుడు కొద్దిదూరం వెళ్ళేసరికి ఒక దిగుడుబావి వచ్చింది. వాడు అందులోకి దిగి, ఒక మెట్టు మీద కూర్చున్నాడు. మూడో జాములో పైకి వచ్చి, ఆ మూట తీసుకుని ఇంటికి పోవాలని వాడి ఉద్దేశం.

కడుంబుడు వెళ్ళిన దిక్కున ఒక ఇల్లు కట్టుతున్నారు. ఇటుకలు ఎత్తుగా పేర్చి ఉన్నాయి. ఇడుంబుడి ఉద్దేశంతోనే

వి. సర్వేశ్వరరావు

కడుంబుడు ఆ ఇటుకల వెనక దాక్కున్నాడు.

కొంచెంసేపు గడిచాక వాడు కొన్ని ఇటుకలను మూటగట్టి, దాన్ని తీసుకుని పల్లానికి వచ్చి, నగల మూటను తీశాడు. దాన్ని ఎక్కడైనా దాచి, దాని స్థానంలో ఇటుకల మూటను పూడ్చి పెట్టాలనుకుని, వాడు ఆ ఇటుకల మూటను పల్లం వద్ద ఉంచి, బరువుగా ఉన్న నగల మూటను దిగుడు బావి దగ్గిరికి తీసుకుపోయి, అందులో పడేశాడు.

ఆ మూట బావి మెట్టు మీద కునుకుతున్న ఇడుంబుడి నెత్తిన పడి, బావి అడుగున కొద్దిగా ఉన్న నీటిలో పడింది. దెబ్బకు స్పృహతప్పి, ఇడుంబుడు కూడా ఆ కొద్ది నీటిలో పడిపోయాడు.

ఈ సంగతి తెలియని కడుంబుడు పలానికి తిరిగి వచ్చి ఇటుకల మూటను ఎత్తుకున్నాడు.

ఇంతలో మూడోవాడు దుడుంబుడు అదే మాదిరి దురుద్దేశంతో పల్లానికి వచ్చి, మూట పట్టుకుని ఉన్న కడుంబుణ్ణి చూసి, "దొంగ వెధవా, ఉమ్మడి సొత్తు కాజేతామనుకున్నావా?" అంటూ, కడుంబుడి నెత్తిన దుడ్డుకర్రతో కొట్టాడు కడుంబుడు స్పృహతప్పి పడిపోయాడు.

దుడుంబుడు ఇటుకల మూట ఎత్తుకుని, ఇల్లు కట్టేదిక్కుగా పరిగెత్తాడు.

ఆ అలికిడికి అక్కడ పడుకున్న కాపలావాడు లేచి, "ఎవర్రా దొంగా?" అంటూ దుడుంబుడి కాళ్ళ మీద కర్రతో కొట్టాడు. దుడుంబుడు పడిపోయాడు. వాడి చేతిలో మూట విప్పి చూస్తే, అందులో ఇటుకలు ఉన్నాయి. దుడుంబుడు ఇటుకల దొంగ కాబోలునని కాపలావాడు అనుకున్నాడు.

తెల్లవారగానే పల్లం దగ్గిర పడిపోయిన కడుంబుడూ, బావిలోపడిన ఇడుంబుడూ దొరికిపోయారు. దొంగతనం బయట పడింది. దొంగలకు సొత్తు దక్కలేదు. హరిదాసు అన్నమాటలు అక్షరాలా నిజమయాయి.





# దారికి వచ్చిన పశువు

రంగయ్య రెండు కోడెదూడలను విడి విడిగా సంతలలో కొని, వాటిని జత కట్టి, రాముడూ, భీముడూ అని పేర్లు పెట్టి, వాటికి పొలం పనులు మప్పటం ప్రారంభించాడు.

రాముడు మంచి దూడ. అది సులువుగా పనులు నేర్చుకున్నది. కాని భీముడు చాలా మకురు; దున్నుతూ కాడిని వదిలెయ్యటమూ, బండికి కట్టితే కాడి తప్పించుకోవటమూ మొదలైన పనులు చేసేది. అది తిండి మాత్రం బాగా తినేది; అప్పుడప్పుడూ కట్టుతాడు తెంచుకుని, చేలో పడి మేసేది.

అరునెలలు గడిచినా భీముడు దారికి రాలేదు. పొలం పనులు ముమ్మరమయే రోజులు వచ్చేస్తున్నాయి. చెరుకు ఎదిగి సిద్ధంగా ఉన్నది. త్వరలోనే చెరుకు నరికి, బండ్ల మీద పంపి, బెల్లం ఆడించాలి. ఎరువులు తోలుకోవాలి. నువ్వుల చేను దుక్కి చేసుకోవాలి.

భీముణ్ణి దారికి తీసుకురావటం గురించి బాగా ఆలోచించి రంగయ్య భీముణ్ణి తెలకల తిరపతయ్యకిచ్చి, రెండురోజుల పాటు నూనె గానుగకు వాడుకోమన్నాడు. రోజంతా కళ్ళకు గంతలు కట్టించుకుని, గానుగ తిప్పుతూంటే భీముడికి ప్రపంచమంతా అంధకారమయమైపోయింది. దానికితోడు తన వెంట రాముడు లేడు. తిరగకుండా ఆగితే, కర్రతో బాదుతున్నాడు తిరపతయ్య.

రెండు రోజులూ రెండు యుగాలనిపించాయి భీముడికి!

మూడో రోజు రంగయ్య భీముణ్ణి ఒంటెద్దుబండి వీరడికిచ్చి, రెండు రోజులు వాడుకోమన్నాడు. రెండెడ్లబండి కాడి లాగా ఒంటెద్దుబండి కాడి తప్పుకోవ

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

టానికి వీలుగా లేదు. ఎరువుల బస్తాలన్నీ కరణంగారి ఇంటికీ, మునసబుగారి ఇంటికీ, మరికొన్ని ఇళ్ళకూ ఒంటెద్దు బండిలో భీముడే లాగవలసి వచ్చింది. భీముడికి ఆ రెండు రోజులూ యమ యాతన అనిపించింది.

వీరడి దగ్గర రెండు రోజులుంచిన తర వాత రంగయ్య భీముణ్ణి చేదల మోట తిప్పేందుకు చలమయ్యకు అరు విచ్చాడు. చేదల మోట తిప్పటానికి భీముడు ఎండలో తిరగవలసి వచ్చింది. ఇంతకన్న నూనెగానుగ తిప్పటమే నయ మనిపించింది. ఎందుకంటే అది నీడలో పని. కళ్ళు చెమటలు పట్టి, నోట నురుగులు వచ్చినా, చలమయ్య భీముడి చేత రెండు రోజుల పాటు ఎండలో పని చేయించాడు.

తరవాత రంగయ్య భీముణ్ణి రెండు రోజుల పాటు ఒంటి చేద నూతినీళ్ళు తోడటానికి నూకన్నకు అరువిచ్చాడు. ఇది మరీ కష్టమైన పని. భీముడు ముందుకు వెళ్ళితే నీళ్ళగూన నీళ్ళతో బయటికి వస్తుంది. మళ్ళీ తాను వెనకకు వెళ్ళితే గూన నూతిలోకి దిగుతుంది. ఈ విధంగా నూకన్న భీముణ్ణి ఎండలో పొద్దస్త మానమూ వెనక్కూ, ముందుకూ అదేపనిగా నడిపించాడు.

రెండు రోజులు ఇలా బాధపడిన మీదట, రెండో రోజు సాయంకాలం రంగయ్య వచ్చి, భీముణ్ణి తన ఇంటికి తోలుకు వెళ్ళాడు. ఎనిమిది రోజుల అనంతరం రాముడు కనిపించగానే భీముడికి అమిత మైన ఆనందం కలిగింది. ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఇతరుల కన్న తన యజమాని శ్రద్ధగా వేళకు కుడితీ, దాణా, పచ్చిగడ్డీ పెడుతూంటే భీముడి ప్రాణానికి ఎంతో హాయి అనిపించింది. ఎండలో పనిచెయ్యటం లేదు. ఎప్పుడూ నీడనే కట్టి ఉంచేవారు.

భీముడు సులువుగా దారికి వచ్చి, రాముడితో సమంగా పొలం పనులన్నీ చేయసాగింది.



# కొడుకు కోసం!

విజయదుర్గం అనే ఊళ్ళో విశ్వాచారి పేరుమోసిన వైద్యుడు. అతనిలో వైద్యం కన్న భేషజం హెచ్చు. దాన్నే అతను తన కొడుక్కు నేర్పుతున్నాడు.

ఇంతలో విశ్వాచారికి పెద్ద జబ్బు చేసింది. తన వైద్యం పారలేదు. చావు తప్పనట్టు కన బడింది. ఇంకో వైద్యుడి చేత చికిత్స పొందాలంటే, తన పేరు పోవటమే గాక, తన కొడుక్కు భవిష్యత్తు ఉండదు. అందుచేత అతను తనకు తెలిసిన వైద్యమే తన కొడుకు చేత చేయించు కుంటూ, చావు కోసం ఎదురు చూస్తున్నాడు.

విశ్వాచారి చావుబతుకుల్లో ఉన్నట్టు విని శరభాచారి అనే వైద్యుడు చూడవచ్చాడు. విశ్వాచారి పోతే ఆ స్థానం తాను కాజేయాలని శరభాచారి ఉద్దేశం. విశ్వాచారి ఇది గ్రహించి, తన శక్తినంతా కూడగట్టుకుని, మంచంలో లేచి కూర్చుని, తన కొడుకు తన వ్యాధికి అద్భుతంగా చికిత్స చేస్తున్నట్టు శరభాచారితో మాట్లాడాడు. శరభాచారి సంతోషం ప్రకటించి, విజయ దుర్గంలో తాను స్థిరపడే ఉద్దేశం మానుకుని వెళ్ళిపోయాడు.

విశ్వాచారి, ఆశ్చర్యంగా చూస్తున్న తన కొడుకుతో, "నిన్ను గురించి గొప్ప అభిప్రాయం కలిగించటానికి శ్రమపడ్డాను. లేకపోతే వాడు ఇక్కడికి వచ్చి, నీకు తిండిపుట్టకుండా చేసే వాడు!" అంటూ వెనక్కు పడిపోయి, ప్రాణాలు వదిలాడు.

—ఎం. డి. సౌజన్య






కనకయ్య కూతురి పెళ్ళి నిశ్చయమయింది. కాని కూతురి పెళ్ళి తన ఇంట చేస్తే ఊళ్ళో అందరినీ పిలవవలసి వస్తుందని, లోభి అయిన కనకయ్య మరో ఊళ్ళో ఏర్పాటుచేసి, పెళ్ళికొడుకు వైపువాళ్ళు అలా కోరారని అడిగిన అందరితోనూ బొంకాడు.

పెళ్ళి రెండు రోజులుందనగా పెళ్ళి ఏర్పాట్లు చూడటానికి తన కొడుకును పంపి, రేపు పెళ్ళి అనగా కనకయ్య తన భార్యనూ, కూతురినీ వెంటబెట్టుకుని, అతి ముఖ్యులైన బంధువులతో రెండెడ్లబండిలో ప్రయాణమయాడు.

మామూలు పరిస్థితుల్లో అయితే వాళ్ళు ఆ రాత్రికే గమ్యస్థానం చేరి ఉండవలసింది. కాని దారిలో ఒక ఎద్దుకు జబ్బు చేసింది. దాన్ని ఎవరి ఇంటనో దిగవిడిచి, మరొక ఎద్దును కుదుర్చుకుని, కాలయాపన చెయ్యటంలో, సూర్యాస్తమయం అయి బాగా చీకటిపడే సరికి సగం ప్రయాణం కూడా పూర్తికాలేదు.

తన కొడుకు ఆ ఊళ్లో సత్రానికి అద్దె ఇచ్చి, అందరికోసం వంట కూడా చేయించి ఉంటాడు. ''అంతా దండగ!'' అంటూ కనకయ్య ఆదేపనిగా వాపోయాడు.

ఈ ఛిద్రానికి తోడు వర్షం పడింది. దారి అంతా బురదా, రొచ్చూనూ! దారి పక్కన ఉన్న శ్మశానం నుంచి నక్కల కూతలూ, గుడ్లగూబల అరుపులూ భయం పుట్టేటట్టు వినవస్తున్నాయి. గతుకుల దారిన పోతున్న బండి, అకస్మాత్తుగా ఒక పక్కకు ఒరిగింది. ఆ పక్క చక్రం బురద గుంటలో దిగబడింది.

అందరూ బండి దిగి బండిని గోతిలో నుంచి బయటికి తొయ్యటానికి ప్రయ

మాచిరాజు కామేశ్వరరావు

త్నించారు. కాని ఎంత ఆయాసపడినా లాభంలేకపోయింది.

ఇంతలో కనకయ్యకు పెద్ద కోలాహలం వినిపించింది. బండి గూడు మీద ఎవరో దూకినట్టు అయింది.

కనకయ్య పైకి చూసి నిర్ఘాంత పోయాడు. గూడు మీద కొన్ని మరుగుజ్జు పిశాచాలు చేరి, పల్టీలుకొడుతున్నాయి!

''ఎవరు మీరు?''. అని కనకయ్య వాటిని అడిగాడు.

''మేం మరుగుజ్జు పిశాచాలం! మీరు ఇలా వల్లకాటికి ఏం పని మీద వచ్చారు?'' అని పిశాచాలు అడిగాయి.

కనకయ్య ధైర్యం తెచ్చుకుని, ''వల్లకాటికి రావటానికి మాకు ఏం ఖర్మ పట్టింది? రేపు మా అమ్మాయి పెళ్ళి!'' అన్నాడు.

''పెళ్ళోయి పెళ్ళి! అరిశెలోయి అరిశెలు! బూరెలోయి బూరెలు!'' అంటూ మరుగుజ్జు పిశాచాలు నృత్యాలు చేశాయి.

''ఏం పెళ్ళో? బండి బురదగుంటలో ఇరుక్కుపోయి, పైకి రాకుండా ఉన్నది,'' అన్నాడు కనకయ్య.

''పెళ్ళికి మమ్మల్ని తీసుకుపోయేట్టుంటే, మేం క్షణంలో బండిని పైకి లాగుతాం,'' అన్నాయి పిశాచాలు.

''బండి పైకి లాగండి. మిమ్మల్ని తప్పకుండా పెళ్ళికి తీసుకుపోతాం,'' అన్నాడు కనకయ్య.



అందరూ బండిలో ఎక్కి కూర్చున్నారు. పిశాచాలు బండి గూడు మీది నుంచి కిందికి దూకి, బండిని పైకి తోసేశాయి. తరవాత బండి రెట్టింపు వేగంతో నడవ సాగింది.

"బంధువుల్ని తప్పించుకుని, పెళ్ళికి పిశాచాలను వెంట తీసుకుపోతున్నావు!" అని కనకయ్యను అతని భార్య ఎత్తి పొడిచింది.

"నీ మొహం! మనం ఆ ఊరు చేరే సరికి తెల్లవారేపోతుంది! పిశాచాలు తమ దారిన తాము పోతాయి," అన్నాడు కనకయ్య.

"బండి పోతున్న వేగం చూస్తే, కోడి కూసేలోపునే చేరిపోయేటట్టున్నాం! అప్పుడేం చేస్తావు? ఈ పిశాచి అతిథులకు మర్యాదలు చెయ్యటం నా వల్ల కాదు! అదేదో నువే చూసుకో!" అన్నది కనకయ్య భార్య.

"ఆడవాళ్ళకు ఆలోచనాశక్తి అవగింజంత అయినా ఉండదు! ఊరు చేరగానే, భద్రకాళి గుడి దగ్గిర ఆగి, 'ఇక్కడే పెళ్ళి! అందరూ లోపలికి పదండి!' అని పిశాచాలతో అంటాను. అంతే! పిశాచాలు కాలికి బుద్ధి చెబుతాయి," అంటూ కనకయ్య విరగబడి నవ్వాడు.

కనకయ్య భార్య తన భర్త తెలివికి సంతోషిస్తూనే, పైకి చిరాకు నటించుతూ, "నెమ్మదిగా మాట్లాడు! అవి వినగలవు!" అన్నది.

తరవాత వాళ్ళు నిద్రపోయి ఉంటాలి. ఏదో కుదుపుకు వాళ్ళు మేలుకునేసరికి, పూర్తిగా తెల్లవారి ఉన్నది.

కనకయ్య, బండి కుదుపుకు ఒళ్ళంతా హూనమై, నిద్రకళ్ళతో బండి దిగి చూస్తే, బండి యింకా రాత్రి దిగబడిన గోతిలోనే ఉన్నది.

"నువు నన్ను అనవసరంగా వాగించావు. నా మాటలు విని పిశాచాలు బండిని తెల్లవార్లూ గుండ్రంగా తిప్పి, మళ్ళీ గోతిలోకి తోశాయి!" అని కనకయ్య భార్యను తప్పుపట్టాడు.





# కీడుచేసే నమ్మకాలు

రత్నపురానికి చెందిన ధనగుప్తుడు అనే వ్యాపారి చాలా సంవత్సరాలపాటు సముద్ర వర్తకం చేస్తూ తూర్పు దీవులలో ఉండి పోయి, అక్కడే పెళ్లి కూడా చేసుకుని, అంతులేని లాభాలతో తన జన్మస్థానానికి తిరిగివచ్చి, తన బాల్యమిత్రుడైన రామగుప్తుణ్ణి చూడవచ్చాడు.

రామగుప్తుడు అప్పటికే వర్తకులలో అగ్రస్థానం సంపాదించుకుని మహారాజులను తలదన్నే వైభవంతో తులతూగుతున్నాడు. మిత్రులిద్దరూ చాలా సేపు ఒకరి అనుభవాలు ఒకరికి చెప్పుకున్నారు.

రామగుప్తుడి ఇంటికి సుదర్శన నిలయం అన్న పేరు ఉండటం చూసి, ధనగుప్తుడు, "ఈ సుదర్శనుడు ఎవరు?" అని అడిగాడు.

"వాడు నా చిన్నకొడుకు. వాడు పుట్టిన తరవాతనే నాకు దశ ఎత్తుకున్నది. మట్టి పట్టుకుంటే బంగారమవుతున్నది," అన్నాడు రామగుప్తుడు.

ఈ ఒక్క విషయంలోనే గాక, రామగుప్తుడు తన పెద్దకొడుకు గురించి అడిగినా చెప్పకపోగా, తనకు జరిగిన ప్రతి మంచీ తన చిన్నకొడుకుతో ముడిపెట్టి మాట్లాడటం ధనగుప్తుడు గమనించి, "ఇంతకూ నీకెందరు కొడుకులు?" అని అడిగాడు.

"ఇద్దరే. పెద్దవాడు సుమంతుడు పదేళ్ళవాడు. చిన్నవాడు సుదర్శనుడికి ఆరేళ్ళు," అన్నాడు రామగుప్తుడు.

రామగుప్తుడి లాగా పైకివచ్చిన వారికి స్వశక్తి మీదా, స్వయంకృషి మీదా నమ్మకం ఉండాలి గాని, తన అదృష్టానికి ఇతరత్రా కారణాలు చూడటం ధనగుప్తుడికి ఆశ్చర్యం కలిగించింది.

అంతకన్న కూడా దారుణం ఏమంటే, రామగుప్తుడికి తన చిన్నకొడుకు తెచ్చిన

గంగిశెట్టి శివకుమార్



అదృష్టం మీద అంతనమ్మకం ఉన్నప్పుడు ఆ చిన్నకొడుకు తలతిరిగిపోయి ఎందుకూ పనికిరాకుండాపోయే ప్రమాదం ఉన్నది. అదేవిధంగా రామగుప్తుడి పెద్దకొడుక్కు తనలో తనకు ఏ మాత్రమూ విశ్వాసం లేకుండా పోయే ప్రమాదం ఉన్నది.

ఇలా ఆలోచించి, ధనగుప్తుడు, "చూడు రామగుప్తా! నా కింకా సంతానం కలగలేదు. నా భార్య దేశాంతరాల నుంచి వచ్చిన మనిషి. ఆవిడ ఒంటరితనంతో బాధపడకుండా, నీ పెద్దకొడుకును కొంతకాలం మా ఇంట పెరగనియ్యరాదా ?'' అన్నాడు.

ధనగుప్తుడు ఈనాడు తనను మించిన ధనికుడే గనక, రామగుప్తుడు తన పెద్దకొడుకు సుమంతుణ్ణి ధనగుప్తుడి ఇంట పెరగనియ్యటానికి ఒప్పుకున్నాడు.

కొంతకాలం గడిచింది. ఒకరోజు రామగుప్తుడు ధనగుప్తుణ్ణి చూడబోయాడు. ధనగుప్తుడు విచారంగా ఉన్నట్టు కనిపించాడు. రామగుప్తుడు అందుకు కారణం అడిగాడు.

"విచారం కాక ఏమిటి? నేను సముద్ర వ్యాపారం మొదలుపెట్టినాక నష్టం అన్నది ఎరగను. అలాటిది నా ఓడలలో ఒకటి లక్షల విలువచేసే సరుకుతో సముద్రంలో మునిగినట్టు వార్త వచ్చింది. ఎందుకో చెప్పలేను, నీ కొడుకు నా యింట అడుగుపెట్టిన తరవాత నాకు అడుగడుగునా అపజయంగానే ఉన్నది,'' అన్నాడు ధనగుప్తుడు.

ఈ మాట విని రామగుప్తుడు కొంచెం బాధపడ్డాడు, కాని తన మిత్రుడికి కలిగిన నష్టానికి సానుభూతి చూపక తప్పలేదు.

మరికొన్ని రోజుల అనంతరం ధనగుప్తుడు ఖిన్నవదనంతో రామగుప్తుడి ఇంటికి వచ్చాడు.

రామగుప్తుడు తన మిత్రుడి వాలకం చూసి కంగారుపడి, ''ఏమిటి విశేషం?

మళ్ళీ నష్టం జరగలేదు గద?'' అని అడిగాడు.

''ధన నష్టాన్ని మించిన ఆపదే వచ్చిపడింది. ఈసారి నా భార్య విచిత్ర మైన జబ్బుతో మంచాన పడింది. వైద్యులు ఆమె జబ్బు ఏమిటో కూడా చెప్పలేని స్థితిలో ఉన్నారు! చూడు, రామగుప్తా! నీ పెద్దకొడుకు వల్ల నీకు అరిష్టం కలిగినట్టు ఎప్పుడైనా అనిపించిందా? ఈ మాట ఎందుకు అడుగుతున్నానంటే, వాడు నా ఇంటికి వచ్చినాక నాకు ఒక్క మంచి జరిగినట్టు జ్ఞాపకం రావటం లేదు,'' అన్నాడు ధనగుప్తుడు.

అతని మాటలు విని ఈసారి రామ గుప్తుడికి అరికాలిమంట నెత్తికెక్కింది.

''నా కొడుకు నాకు ఎన్నడూ ఎటు వంటి అరిష్టమూ కలిగించలేదు. వాణ్ణి నీ అంతట నువే నీ యింట ఉంచుకుంటా నన్నావు! నీకు ఏవైనా నష్టాలు కలిగితే, వాటికి సరి అయిన కారణాలు తెలుసుకో కుండా, అన్నిటికీ నా కొడుకే కారణం అనుకోవటం నా బుద్ధికి మూఢ విశ్వా సంగా కనిపిస్తున్నది. వాణ్ణి వెంటనే నా వద్దకు తిప్పి పంపెయ్యి!'' అన్నాడు రామగుప్తుడు రోషంగా.

ఈ మాట వినగానే ధనగుప్తుడి ముఖం ఒక్కసారిగా వికసించింది.

''అవును, రామగుప్తా! నువు మీ వాణ్ణి తీసుకుపోవటమే మంచిదని నాకూ తోస్తు న్నది. ఇప్పుడే నా వెంట మా ఇంటికి



వచ్చెయ్యి. మళ్ళీ ఆలస్యం దేనికి?'' అన్నాడు ధనగుప్తుడు.

రామగుప్తుడు వెళ్ళేసరికి ధనగుప్తుడి ఇంట విషాద సూచనలు ఏవీ కనబడ లేదు. ఇల్లు పెళ్ళిల్లు లాగా సందడిగా ఉన్నది. ధనగుప్తుడి భార్య ఒంటినిండా నగలు ధరించి ఖరీదైన పట్టుచీరతో లక్ష్మీ దేవి లాగా అటూ ఇటూ తిరుగుతూ, నవ్వుతూ వచ్చి రామగుప్తుణ్ణి పలక రించింది.

అంతకన్న రామగుప్తుడికి అంతులేని ఆశ్చర్యం కలిగించినదేమంటే, తన పెద్ద కొడుకు ఎంతో ఉల్లాసంగా, ఇల్లంతా తనదే నన్నట్టు తిరుగుతున్నవాడు కాస్తా తండ్రిని చూడగానే బిగుసుకుపోయాడు.

రామగుప్తుడు ధనగుప్తుడి కేసి నోట మాట లేకుండా చూశాడు. అతన్ని ఏమి అడగాలో కూడా రామగుప్తుడికి స్ఫురించ లేదు.

''అర్థంకాలేదా, రామగుప్తా? నాకు ఏ నష్టమూ రాలేదు. ఒకవేళ వచ్చి ఉంటే అది నీ కొడుకు వల్ల వచ్చిందను కునేటంత మూఢుణ్ణి కాను నేను. నువు నీ చిన్నకొడుకును నీ అదృష్టదేవతగా అందరితోనూ చెబుతుంటే, నీ పెద్దకొడుకు మనస్సు ఎలా ముడుచుకుపోతున్నదోననీ, నీ చిన్నకొడుకు తల ఎంత వాచిపోతున్నదో ననీ భయపడి, నీకు జ్ఞానోదయం కలగ టానికి నీతో రెండు అబద్ధాలాడాను. మరేమీ అనుకోకు. రేపు నీకు ఏ కారణం చేతనైనా కలిసిరాకపోతే నీ చిన్నకొడుకు తనదే తప్పుకాబోలు నని ఎంతగా బాధపడతాడో ఆలోచించావా? నువు ఎప్పుడైతే నాలో మూఢవిశ్వాసం గుర్తించగలిగావో అప్పుడే నా ప్రయత్నం ఫలించింది. నీ కొడుకును నువు తీసుకుపో,'' అన్నాడు ధనగుప్తుడు.

రామగుప్తుడు తలవంచుకుని, ''నా కంతా అర్థమయింది. నేను మార టానికి ఇంకా కొంతకాలం పట్టవచ్చు. మరికొన్ని రోజులు వాణ్ణి నీ ఇంటనే ఉండనీ. వాడిక్కడ చాలా సుఖంగా ఉన్నట్టున్నాడు,'' అన్నాడు రామగుప్తుడు.





# దేవీ భాగవతం

## 15. శుంభ, నిశుంభులు

మహిషాసురుణ్ణి చంపి, దేవి అంతర్ధానం అయిన అనంతరం దేవతలు మహిషుడి రాజ్యానికి శత్రుఘ్నుడు అనే సూర్య వంశపు రాజును రాజుగా అభిషేకించి, తమ దారిన తాము కూడా వెళ్ళిపోయారు.

ప్రపంచం సుఖంగా ఉన్న సమయంలో మళ్ళీ దానవుల పీడ దాపురించింది. రసాతలంలో శుంభుడూ, నిశుంభుడూ అనే ఇద్దరు దానవులు ఆహారమూ, నీరూ తీసుకోకుండా ఘోర తపస్సు చేశారు.

వారి తపస్సుకు మెచ్చి, బ్రహ్మ ప్రత్యక్షమై, ఏదన్నా వరం కోరుకోమన్నాడు.

"నీ చేత గాని, ఇతరుల చేత గాని, ఎవరి చేత గాని మాకు చావు లేకుండా వరం ఇయ్యి," అన్నారు వాళ్ళు.

"లాభం లేదు. ఇంకేదైనా వరం కోరండి," అన్నాడు బ్రహ్మ.

"ఆడదాని చేత తప్ప మరెవరి చేతా మాకు చావు లేకుండా అనుగ్రహించు. ఆడది మమ్మల్ని చంపినప్పటిమాట చూసుకుంటాం," అన్నారు శుంభ, నిశుంభులు.

బ్రహ్మదేవుడు వరం ఇచ్చాడు.

ఆ అన్నదమ్ములు బ్రహ్మ వల్ల ఇలా వరం పొంది, భృగుమహామునిని తమకు పురోహితుడుగా పెట్టుకున్నారు. మంచి ముహూర్తం చూసి శుంభుడు రాజ్యాభిషేకం చేసుకుని, తన తమ్ముడైన నిశుంభుడు మంత్రిగా రాజ్యపాలన సాగించాడు. చండ, ముండు లనే మహావీరులు



ఇంద్రుడి నగరానికి వెళ్ళేసరికి, ఇంద్రుడు దేవతలను వెంటబెట్టుకుని వచ్చి, యుద్ధం ప్రారంభించి, నిశుంభుణ్ణి వజ్రాయుధంతో కొట్టేసరికి వాడు కాస్తా మూర్ఛపోయాడు.

తన తమ్ముడు మూర్ఛపోయాడని విని శుంభుడు మండిపడి, యుద్ధానికి వచ్చి, దేవతలను చెల్లాచెదరుచేసి, ఇంద్రుడు మొదలైన వారిని జయించి, తానే ఇంద్రత్వం పుచ్చుకుని, అష్టదిక్పాలకులను లోబరచుకుని, మూడులోకాలూ ఏలుతూ, నందనవనంలో అప్సరసలతో విహరించ సాగాడు.

దిక్పాలకుల స్థానాలలో శుంభుడికి ఇష్టులైన దానవులు నియోగించబడ్డారు. శుంభుడి పరిపాలనలో దేవతలు దిక్కులేనివారై, అడవులుపట్టిపోయి, గుహలలో తలదాచుకుంటూ, సుఖం ఏ మాత్రమూ లేని జీవితం గడిపారు.

ఈ విధంగా వెయ్యి సంవత్సరాలు గడిచాయి. కష్టాలపాలై ఉన్న ఇంద్రుడు మొదలైనవాళ్ళు, స్వర్గాన్ని తిరిగి ఎలా సంపాదించాలో, శుంభుణ్ణి ఎలా చంపాలో తెలియక, ఒకనాడు బృహస్పతితో, "మహాత్మా, నీకు తెలియనిదంటూ ఏదీ లేదు గదా! దేవతలకు ఈ దుస్థితి తొలగే ఉపాయం ఏదో చూడు. మంత్రాలు గొప్ప ప్రభావం గలవి. వాటితో అభిచార

సేనాపతులుగా ఉన్నారు. పాతాళం నుంచి ధూమ్రలోచనుడూ, రక్తబీజుడూ అనే వాళ్ళు రెండు అక్షౌహిణుల సేనతో వచ్చి, శుంభ, నిశుంభుల కొలువులో చేరారు.

రక్తబీజుడనేవాడు యుద్ధరంగంలో ఉద్దండుడు. యుద్ధంలో వాడికి గాయం తగిలి, వాడి రక్తం భూమి మీద పడితే, వాడిలాటి మహావీరులు వేనకువేలు పుట్టుకు వస్తారు. అందుకే వాడికి రక్తబీజుడు అనే పేరు వచ్చింది.

ఇలాగే అనేకమంది దానవవీరులు శుంభుడి కొలువులోకి వచ్చి చేరారు.

ఇలా ఉండగా ఒకసారి నిశుంభుడికి ఇంద్రుణ్ణి జయించాలని పుట్టింది. వాడు

హోమం గాని, మరేదైనా గాని చేయించి, మా రాజ్యం మాకు ఇప్పించు.'' అన్నారు.

''ఇంద్రా, మంత్ర తంత్రాలైనా విధిని అనుసరించే పనిచేస్తాయి. దానికి వ్యతిరేకంగా పనిచేయలేవు. వాటికి అధిపతులైన మీరే దుర్దశ అనుభవిస్తున్నారు. ఈ స్థితిలో మంత్రాలు మీకు ఎలా సహాయపడతాయి? అయినా ఒకటి చెయ్యవచ్చు. జగజ్జనని మహిషాసురుణ్ణి చంపిన సంగతి మీకు తెలుసు కదా? ఆవిడనే మళ్ళీ ఆశ్రయించండి. మీరు హిమాలయానికి వెళ్ళి ఆ దేవి మాయాబీజ పునశ్చరణ చెయ్యండి. మీ పని తీరవచ్చు.'' అన్నాడు దేవగురువైన బృహస్పతి.

దేవతలు ఆ ప్రకారమే హిమాలయానికి వెళ్ళి, మాయాబీజాన్ని జపిస్తూ, దేవిని స్తోత్రం చేశారు.

దేవి మంచి చీర కట్టి, అందమైన బంగారు ఆభరణాలు ధరించి, గంగలో స్నానం చెయ్యటానికి పోతున్నదానిలాగా ఒక గుహలో నుంచి వస్తూ, దేవతలను చూసి, ''దేవతలల్లే ఉందే? ఏం పని మీద ఇటుకేసి వచ్చారు? విచారంగా ఉన్నట్టు కనిపిస్తున్నారే? ఏమిటి కథ?'' అని అడిగింది.

వాళ్లు ఆమెకు చేతులు జోడించి, ''తల్లీ, మా ఆపద తొలగించు. మేం యుద్ధంలో



దానవులకు తట్టుకోలేక, మా అసమర్థత తెలుపుకోవటానికి వచ్చాం. మాకు నువే కదా దిక్కు? శుంభ, నిశుంభు లనే దానవులు మమ్మల్ని ఓడించి, స్వర్గం ఆక్రమించుకున్నారు. బ్రహ్మ ఇచ్చిన వరం మూలాన వారిని ఎవరూ చంపలేరు. అయితే వీళ్ళు కూడా మహిషుడి లాగే ఆడదాని చేత చస్తారు. కాని వారిని ఏ ఆడది చంపగలుగుతుంది? అందుచేత మేం దిక్కులేనివాళ్ళమై, ఇలా అగచాటు పడుతున్నాం. పూర్వం మహిషుణ్ణి చంపినప్పుడు, మాకు ఆపద కలిగితే దాన్ని తీర్చుతానని మాట ఇచ్చావు. శుంభ, నిశుంభులే కాదు, రక్తబీజుడూ, చండ,



ముండులూ కూడా మాకు శత్రువులై ఉన్నారు. ఇవాళ అష్టదిక్పాలకు లందరూ రాక్షసులే. అందుచేత మా మీద దయ జూపి, ఆ రాక్షసుల నందరినీ సంహరించు.'' అన్నారు.

దేవి దేవతల దైన్యం చూసి జాలిపడి, తన నుంచి కౌశిక అనే శక్తిని పుట్టించింది. ఆ శక్తి నల్లగా ఉండటంచేత కాళిక అనీ, కాళరాత్రి అనీ పిలవబడుతూ, మహా ఘోరమైన రూపం ధరించింది.

''దేవతలారా! విచారించకండి. శుంభ, నిశుంభులనూ, ఇతర రాక్షసులనూ చంపి, మీకు మేలు చేకూర్చుతాను.'' అని దేవి దేవతలకు అభయం ఇచ్చి, తన నుంచి పుట్టిన కౌశికిని తన పార్శ్వంలో ఉంచుకుని, సింహం మీద శత్రువుల నగరానికి వెళ్ళి, నగరం వెలపల ఉన్న వనంలో విడిసి, అక్కడ అతిమనోహరంగా గానం చేసింది. ఆ గానానికి దేవతలు పరమానందం చెందారు. మృగాలు తమను తాము మరిచాయి. పక్షులు చెవులు రిక్కించి విన్నాయి.

ఆ సమయంలో చండ, ముండులు విలాసంగా ఉపవనాలలో విహరిస్తూ, మనోహరమైన ఆ గానాన్ని కొంతసేపు విని, దగ్గిరికి వచ్చి జగన్మోహిని అయిన అంబ అవతారాన్ని, ఆమె వెంట ఉన్న కౌశికినీ చూసి, అమితమైన ఆశ్చర్యంతో నగరానికి తిరిగిపోయి, శుంభుడికి నమస్కారం చేసి, ఇలా అన్నారు:

''ఎక్కడినుంచో ఒక స్త్రీ సింహం ఎక్కి వచ్చింది. ఆమె అందాన్ని వర్ణించటం అసాధ్యం. మూడులోకాలలోనూ అంతటి సౌందర్యవతి లేదు. ఇక ఆమె గానాన్ని గురించి చెప్పేదే లేదు! మన ఉద్యాన వనంలో ఆమె పాడుతుంటే పశుపక్ష్యాదులు ఆలకిస్తున్నాయి. ఆమె వెంట ఇంకొకతె కూడా ఉన్నది. ఇన్ని మాటలు దేనికి? నువు వెళ్ళి, ఆమె సంగతి ఏమిటో తెలుసుకుని, తీసుకువచ్చి భార్యగా చేసుకున్నావంటే, అంతకు మించిన సుఖం



ఉండదు. ఐరావతాన్నీ, పారిజాతాన్నీ, ఉచ్చైశ్రవాన్నీ (ఇంద్రుడి గుర్రాన్నీ) విమానాన్నీ గెలుచుకున్న నీకు ఈమె భార్య కాదగి ఉన్నది.''

ఈ మాటలతో బాగా కైపెక్కిపోయి శుంభుడు తన సమీపంలో ఉన్న సుగ్రీవుడనేవాణ్ణి పిలిచి, ''నువు వెంటనే నా తరపున వెళ్ళి ఆ స్త్రీని తీసుకురా. శృంగారానికి సంబంధించినచోట భేదోపాయమూ, దండోపాయమూ ఎంతమాత్రమూ పనికిరావు. అందుచేత నువు సామ, దానోపాయాలు మాత్రమే ఉపయోగించు,'' అన్నాడు.

సుగ్రీవుడు వెళ్ళి, సింహం మీద ఎక్కి తిరుగుతున్న జగదంబను చూసి నమస్కరించి, ''అమ్మా, శుంభుడు దేవతలందరినీ జయించాడు, మన్మథాకారుడు! నీకు తెలుసునా? నేను అతని దూతను. నిన్ను గురించి విని, నీ మీద మోహం పుట్టి, నన్ను ఇక్కడికి పంపాడు. నిన్ను తన పెద్ద భార్యగా చేసుకుని, నీకు విధేయుడనుగా ఉంటానని చెప్పమన్నాడు,'' అని చెప్పాడు.

దేవి ఈ మాటలకు చిరునవ్వు నవ్వి, ''మీ రాజు దేవతల నందరినీ జయించాడని విని, అంత గొప్పవాడు గనకనే, అతని కోసమే నేను వచ్చాను. ఈ మాట అతనితో చెప్పి, ఇంకొక్క సంగతి కూడా అతనికి తెలియజెయ్యి. అదేమిటంటే, నన్ను యుద్ధంలో ఓడించే వీరుణ్ణి తప్ప పెళ్ళాడనని నా కొక వ్రతం ఉన్నది ఈ వ్రతం పట్టిననాటి నుంచి నేటిదాకా నా గర్వం అణచిన వీరుడు కానరాలేదు. మీ యజమానిని ఆ పనిచేసి నన్ను చేపట్టమని చెప్పు,'' అన్నది.

ఈ మాటకు సుగ్రీవుడు నిర్ఘాంతపోయి, ''అమ్మా, స్త్రీ సహజమైన దుస్సాహసంతో ఇలా అన్నావు గాని, శుంభుడి పేరు చెబితేనే ఎంతటి వాళ్ళూ ఆక్రందనం చేస్తారు గదా! అతన్ని ఎలా జయించగల ననుకుంటున్నావు? ఇటువంటి ఆలోచనమాని, శుంభుణ్ణో, అతని తమ్ముడు

నిశుంభుణ్ణో భర్తగా చేసుకుని సుఖంగా ఉండు,'' అన్నాడు.

దానికి అంబ, ''నా వ్రతం మానను, నా శూలానికి వెరిచినవాణ్ణి నేను ఎలా పెళ్ళాడతాను? నాతో యుద్ధానికి సిద్ధపడక పోతే మీ యజమానిని స్వర్గ, మర్త్య లోకాలు విడిచి, బంధుమిత్ర సహితంగా రసాతలానికి వెళ్ళిపొమ్మను. నా మాటలు ఉన్నవి ఉన్నట్టు చెప్పు.'' అన్నది.

సుగ్రీవుడు మతిచెడిన వాడిలాగా శుంభుడి వద్దకు తిరిగి వెళ్లి, ముందుగానే క్షమాపణ చెప్పుకుని, దేవి అన్న మాటలు అన్నట్టుగా తెలిపాడు.

శుంభుడు నిశుంభుడి కేసి తిరిగి, ''ఒక ఆడది ఇంకో ఆడదాన్ని తోడు తెచ్చుకుని యుద్ధం చేస్తానని వచ్చిందట! నువు పోతావా? నన్ను పొమ్మన్నావా?'' అని అడిగాడు.

''నువూ వద్దు, నేనూ వద్దు. ధూమ్రలోచనుణ్ణి పంపితే ఆమెను గెలిచి తెస్తాడు. మరుక్షణంలో ఆమె నిన్ను వరిస్తుంది,'' అన్నాడు నిశుంభుడు.

ఈ మాటకు సమ్మతించి శుంభుడు ధూమ్రలోచనుడితో, ''నువు ఆ సుందరికి అండగా ఉన్న స్త్రీని చంపి, సుందరిని తీసుకురా. ఆమె నీ మీద చిన్నగా బాణాలు వేసినా, నువు ఆమెను క్రూర



మైన బాణాలతో హింసించేవు సుమా! ఆమెను చెక్కు చెదరకుండా పట్టుకురా,'' అన్నాడు.

ధూమ్రలోచనుడు సేనాసహితంగా దేవి వద్దకు వెళ్ళి, తన యజమాని ప్రేమ సందేశాన్ని ఆమెకు చెప్పాడు.

వాడి మాటలకు కాళిక జవాబు చెబుతూ, ''సిగ్గులేకుండా, విటకాడిలాగా మాట్లాడతావేం? యుద్ధం చెయ్యి. మా దేవి దేనికి వచ్చిందనుకున్నావు? మీ శుంభ నిశుంభులను యముడి వద్దకు పంపటానికి!'' అన్నది.

ధూమ్రలోచనుడు మండిపడి, ''కయ్యానికి కాలుదువ్వుతావా? నీ గర్వం

అణచలేక ఇంతసేపూ మాట్లాడాననుకు న్నావా ?'' అంటూ యుద్ధానికి తలపడి, కాళిక చేతిలో తాను చావటమే గాక, తన సైన్యాన్ని కూడా పోగొట్టుకున్నాడు.

దేవి దిశలు పిక్కటిల్లేలాగా శంఖం పూరించింది. అది విని శుంభుడు ఏదో మూడిందనుకుని బయలుదేరి వచ్చి చూస్తే, ధూమ్రలోచనుడి జాడ లేదు, సైన్యం జాడా లేదు. చచ్చిన మనుషుల శవాలూ, గుర్రాల శవాలూ కనిపించాయి. హతశేషులు వచ్చి జరిగినది చెప్పారు.

శుంభుడి ప్రణయగాథ తలకిందు లయింది. చేస్తే దేవితో యుద్ధం చేయాలి. లేదా సంధి చేసుకోవాలి. ఆమెతో యుద్ధం చెయ్యగల శూరులు శుంభుడి వెంట చాలా మంది ఉన్నారు.

ముందు చండ, ముండులు దేవి మీదికి యుద్ధానికి వెళ్ళారు. వాళ్ళు చచ్చినాక రక్తబీజుడు వెళ్ళి, మరొకసారి దేవికి, శుంభుణ్ణి గాని, నిశుంభుణ్ణి గాని పెళ్ళాడ మని సలహా ఇచ్చాడు.

''నాతో యుద్ధం చెయ్యగలవాణ్ణే తప్ప పెళ్ళాడనని నీకు ముందే చెప్పాను గదా? ఎందుకు మళ్ళీ మళ్ళీ అర్థంలేని మాట లాడతావు? నీ శుంభ నిశుంభులను వచ్చి నన్ను యుద్ధంలో జయించి పెళ్ళాడ మను,'' అన్నది దేవి.

రక్తబీజుడు మండిపడి యుద్ధం చేసి, క్షణంలో మూర్ఛపోయి తన రథంలోనే పడ్డాడు.

అయితే రక్తబీజుడి రక్తం నేల మీద పడితే, ఒక్కొక్క బొట్టుకు ఒక్కొక్క రక్తబీజుడు పుట్టుకొస్తాడు. అలా చాలా మంది పుట్టుకురావటం చూసి దేవి, వాడి రక్తం నేల మీద పడకముందే తాగెయ్య మని కాళికకు చెప్పి, లోగడ పుట్టుకొచ్చిన వాళ్ళనూ, రక్తబీజుణ్ణీ కూడా చంపేసింది.

చిట్టచివరకు దేవితో యుద్ధం చేసి చచ్చిపోయినవాళ్ళు శుంభ, నిశుంభులు. చావగా మిగిలినవారికి దేవి అభయం ఇచ్చింది. వాళ్ళు పాతాళానికి వెళ్ళి పోయారు.





# దొంగబుద్ధి

ఒక రాజ్యంలో దొంగతనాలు జాస్తి కావటం వల్ల, పట్టుబడిన ప్రతి దొంగనూ ఊరిబయట బహిరంగంగా ఉరితీయవలసిందని రాజుగారు ఉత్తరువు చేశారు. అదేవిధంగా ఎందరో దొంగలు ఉరితీయబడ్డారు కూడా.

ఆ రాజ్యంలోనే ఒక ఊళ్ళో కన్నడూ, చిన్నడూ అని ఇద్దరు దొంగలుండేవారు. తోటి దొంగలు కొందరు ఉరికావటం చూసి బెదిరిపోయి, కన్నడూ, చిన్నడూ దొంగవృత్తి మానటానికి నిశ్చయించారు.

"ఇంతవరకూ చాలా పాపం చేశాం, ఇకనన్నా మంచిగా జీవించుదాం!" అన్నాడు కన్నడు.

"చేసుకోదలిస్తే బోలెడన్ని వృత్తులు!" అన్నాడు చిన్నడు.

వాళ్ళిద్దరూ పక్క గ్రామంలోని పెద్ద రైతు దగ్గర పని సంపాదించుకున్నారు. రోజూ ఎడ్లను బీడుకు తోలుకుపోయి మేపుకు రావటం కన్నడి పని, తోటలో చెట్లకు నీళ్ళు పోయటం చిన్నడి పని.

మొదటి రోజు కన్నడు ఉదయమే లేచి ఎడ్లను తోలుకుని బీడుకు వెళ్ళాడు. ఎడ్లు వాణ్ణి నానా తిప్పలూ పెట్టాయి. వాటిల్లో అవి పోట్లాడుకోవటమూ, పరుగులు తీయటమూ, పక్కనేఉన్న పొలాలలోకి జొరబడటమూ మొదలైన పనులు చేయసాగాయి. వాటిని అదుపులో ఉంచటం కన్నడికి చాలా కష్టమైపోయింది.

ఈ లోపల చిన్నడు తోటలో ఉన్న చెట్లకు నీరు పోయసాగాడు. ఎన్ని కడవలు తోడినా చెట్లకు చాలలేదు. సగం తోటన్నా తడవకముందే చిన్నడికి చేతులు పడిపోయాయి. నడుము విరిగి పోయినట్టుయింది. సాయంత్రం దాకా వాడు తోటకు నీరెత్తుతూనే ఉన్నాడు.

**25 ఏళ్ళనాటి చందమామ కథ**



"భేష్! రేపు సరదాగా నువు ఎడ్లను మేపుకురా, నేను తోట తడుపుతాను," అన్నాడు కన్నడు.

చిన్నడికి చాలా ఆనందం వేసింది. "నేనూ అదే అందామనుకుంటున్నాను!" అన్నాడు వాడు కన్నడితో.

"బీట్లో పడుకునేటందుకు మంచం కూడా మరిచిపోక పట్టుకెళ్లు సుమీ!" అని హెచ్చరించాడు కన్నడు.

మర్నాడిద్దరూ పనులుమార్చుకున్నారు. సాయంకాలానికి ఒకరి మోసం ఒకరికి తెలిసిపోయింది.

అయితే కన్నడు ఇంకొక చిత్రం కూడా గమనించాడు. తోటలో ఒక మామిడి చెట్టు మొదట్లో ఎన్ని కడవల నీరుపోసినా ఇంకిపోతోంది. దాని రహస్యం ఏమిటో ఆ రాత్రి కనిపెట్టి తీరాలనుకున్నాడు కన్నడు.

ఆ రాత్రి భోజనాలయాక కన్నడూ, చిన్నడూ తమతమ పనులను గురించి మాట్లాడుకున్నారు.

"నాకు పనిచేసినట్టే లేదు. ఎడ్లను బీట్లో వొదిలేసి చెట్టుకింద పడుకుని హాయిగా నిద్రపోయాను. అస్తమయం వేళకు ఎడ్లు వాటంతట అవే నా దగ్గిరికి వచ్చాయి. వాటి మువ్వల చప్పుడుకు నిద్రలేచి, వాటిని తోలుకుని ఇంటికి వచ్చాను," అన్నాడు కన్నడు.

"నేనూ అంతే! నాలుగు కడవల నీరు పోసేసరికి తోటంతా తడిసి ఊరుకుంది. రోజల్లా మంచం మీద పడుకుని నిద్ర పోయాను!" అన్నాడు చిన్నడు.

ఆ రాత్రి కన్నడు గాని చిన్నడు గాని తమ పనులను గురించి మాట్లాడనేలేదు. ఇద్దరూ నిద్రపోతున్నట్టు పడుకున్నారు. ఒక రాత్రివేళ కన్నడు లేచి పక్కనే ఉన్న పలుగు తీసుకొని మామిడిచెట్టు దగ్గిరికి వెళ్లి, దాని పాదులో తవ్వటం మొదలుపెట్టాడు. కొంతసేపు తవ్వాక పలుగుకు ఏదో తగిలి ఖంగ్‌మని శబ్దం అయింది.

వెంటనే కన్నడు చుట్టూ చూశాడు. చిన్నడు చీకట్లో పక్కనే నిలబడి ఉన్నాడు.

"ఏమిటి ఈరాత్రివేళ తవ్వుతున్నావు?" అన్నాడు చిన్నడు.

''ఈ చెట్టుకు పాదు సరిగాలేదు, నిద్ర పట్టక పాదు సరిచేస్తున్నాను,'' అన్నాడు కన్నడు అమాయికంగా.

''ఖంగ్‌మని మోగిందేమిటి?'' అన్నాడు చిన్నడు నవ్వు ఆపుకొంటూ.

''ఏదో రాయి అయి ఉంటుంది! పోయి పడుకుందాం పద,'' అన్నాడు కన్నడు.

ఇద్దరూ వెళ్ళి పడుకున్నారు. చిన్నడు నిద్రపోయాక మళ్ళీ వచ్చి పలుగుకు తగిలిన దేమిటో చూతామనుకున్నాడు కన్నడు. కాని ముందు వాడికే నిద్ర పట్టింది.

కన్నడు గురక ప్రారంభించగానే చిన్నడు లేచాడు. పలుగు తీసుకుని మామిడిచెట్టు దగ్గిరికి వెళ్ళాడు. పాదు తవ్వి లంకెబిందెలు పైకి తీశాడు. వాటిని వెంటనే ఎక్కడైనా దాయాలి. సమీపం లోనే చెరువున్నది. లోతు ఆటె లేనిచోట చెరువులో ఆ లంకెబిందెలు మట్టిలో పాతి పెట్టి చిన్నడు ఏమీ ఎరగనట్టు వచ్చి పడుకుని నిద్రపోయాడు.

కన్నడు తెల్లవారుజామునే లేచాడు. పలుగు తీసుకుని చెట్టు దగ్గిరికి వెళ్ళాడు. లంకెబిందెల జాడ కనిపించలేదు. తిరిగి





బిందెల కోసం వెతికాడు. అవి లేవు. కన్నడు వాటిని తీసుకుని స్వగ్రామానికి బయలుదేరి ఉంటాడని గ్రహించి అటు కేసి పరిగెత్తసాగాడు.

చిన్నడు కొంతసేపు పరిగెత్తినాక, వాడికి అంతమారాన బిందెలు మోసుకు పోతూ కన్నడు కనిపించాడు. చిన్నడు డొంక వొదిలేసి అడ్డదారిన పరిగెత్తి కన్నడి కన్న ముందు వెళ్ళి మళ్ళీ డొంక ఎక్కి, తన కొత్త చెప్పులలో ఒకటి ఒకచోట విడిచి, రెండోది నూరు గజాల అవతల విడిచి, అక్కడే ఉన్న ఒక చెట్టెక్కి, గుబురులో దాగి కూచున్నాడు.

కొద్దిసేపటిలో కన్నడు లంకెబిందెలను మోయలేక మోయలేక మోస్తూ అటుగా వచ్చాడు. కొత్తచెప్పు వాడి కంట పడింది. కాని ఒకటే ఉండటం చూసి నిరాశచెంది ముందుకు వెళ్ళాడు. నూరు గజాలు వెళ్ళాక దాని జత కనబడింది. ఆశ పుట్టింది. చుట్టూ పురుగు కూడా లేక పోవటం గమనించి కన్నడు లంకెబిందెలు కిందపెట్టి, అక్కడ ఉన్న చెప్పు తీసుకుని, రెండో దానికోసం వెనక్కు వెళ్ళాడు.

ఈ సమయంలో చిన్నడు మెల్లగా చెట్టు దిగివచ్చి దారిలో పెట్టివున్న లంకెబిందెలు భుజాని కెత్తుకుని శక్తికొద్దీ నడుస్తూ తన ఇల్లు చేరుకున్నాడు.

వచ్చి, నిద్రపోతున్న చిన్నడి కాళ్ళు పరీక్షించాడు. చిన్నడి కాళ్ళకు బురదా, కొంచెంగా నాచూ కనిపించాయి. చెట్టు పాదులో దొరికిన వస్తువును చిన్నడు చెరువు దగ్గిర దాచాడని గ్రహించాడు. నేరుగా చెరువుకు వెళ్ళాడు. చెరువులో ఒక ప్రాంతాన కప్పల అలికిడి లేదు. అక్కడే వెతికి లంకెబిందెలను పట్టుకున్నాడు కన్నడు. వాటిని భుజాన పెట్టుకుని నేరుగా స్వగ్రామానికి బయలు దేరాడు.

చిన్నడు కొద్దిసేపట్లోనే నిద్రలేచాడు. పక్కన కన్నడు లేకపోవటం చూశాడు. చెరువుకు పరిగెత్తి తాను దాచిన లంకె

రెండు కొత్తచెప్పులూ తీసుకుని కన్నడు తిరిగివచ్చేసరికి లంకెబిందెలు లేవు. ఇది చిన్నడి పనేనని రూఢిచేసుకుని కన్నడు చకచకా నడిచి, కొద్దిసేపట్లోనే చిన్నడి ఇంటికి వెళ్ళాడు.

చిన్నడి ఇంట్లోకి అడుగుపెట్టేసరికి ఏడుపులూ పెడబొబ్బలూ వినిపించాయి. కన్నడు ఆశ్చర్యపోయి ఏమిటని అడిగాడు.

అందుకు చిన్నడి భార్యా, కొడుకూ శోకాలు పెడుతూ, చిన్నడు చచ్చిపోయా డని చెప్పారు. గుడ్డ కప్పి నట్టింటో పడుకో బెట్టిన చిన్నణ్ణి కూడా చూపించారు.

కాస్సేపు కన్నడు కూడా వాళ్ళతోబాటు ఏడిచి, ఈ విధంగా అన్నాడు:

"ఇద్దరం ఎంతో స్నేహంగా ఉండే వాళ్ళం. ఇక చిన్నడి ఆఖరు కోరిక తీర్చటం తప్ప నేచేయగలిగిందేమీ లేదు. తాను నా కన్న ముందు చచ్చిపోతే తన శవాన్ని కొట్టేసిన కందిచేనులో కంది మోళ్ళ మీదిగా లాగమని నన్ను కోరాడు. వాడి ఆఖరు కోరిక తీరుస్తాను!"

ఈ మాటలంటూ కన్నడు చిన్నడి శరీ రాన్ని భుజాన వేసుకుని, ఎవరి మాటలూ వినిపించుకోకుండా, గ్రామం పొలిమేరలో వున్న కొట్టిన కందిచేను దగ్గిరికి తీసుకు పోయాడు.

నేలలో పాతిన కత్తుల్లాగా ఉన్న కంది మోళ్ళు చూసేసరికి చిన్నడికి నిజంగానే ప్రాణంపోయినంత పని అయింది. ఊరు కుంటే నిజంగానే తనను కందిమోళ్ళ మీదుగా లాగుతాడని అతడికి భయం కలిగింది.

చిన్నడు చప్పున లేచి కన్నడి కాళ్ళు పట్టుకుని, "అన్నా, నన్ను మన్నించు! మనం దొంగబతుకు చాలించి నీతిగా బతుకుదామనుకున్నాం గదా, ఇంక దొంగ బుద్ధులు మాత్రం దేనికి? రెండు బిందె లున్నాయి. చెరొకటీ తీసుకుని ఆ ధనంతో హాయిగా జీవింతాం!" అన్నాడు.

లంకెబిందెలను కన్నడూ, చిన్నడూ సమంగా పంచుకుని ధనవంతులై సుఖంగా కాలం వెళ్ళబుచ్చారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



D. N. Shirke





Srivatsa S. Vati

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : భలే నటుడు

రెండవ ఫోటో : బాల నటుడు

పంపినవారు : కూచి లలిత (తెలుగు స్కూలు) రామకృష్ణాపురం, న్యూ ఢిల్లీ.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

The stories, articles and designs contained herein are exclusive property of the Publishers and copying or adopting them in any manner will be dealt with according to law.




# కెనరా బ్యాంక్

(భారత ప్రభుత్వ సంపూర్ణ స్వామ్యంలోనిది)

తక్కువేమీ కాదు;
ఏ డిపాజిట్ అయినా

ఈరోజు తలమీద చిన్న జడప్రాయలతో ఆమె చిన్న అమ్మాయి. ఈరోజు బొమ్మల కొలువుతో ఆమె వండటం తినిపించటం వంటి అమ్మలాట ఆడుతుంది. రేపు ఆమె చాలీచాలని రాబడితో ఇల్లు గడపాలంటే ఎలా భరిస్తుంది? ఈరోజే ఆమెకు తేలిక మార్గంలో ఎలా పొదుపు చేయ్యాలో, మరియు ఆమె భవిష్యత్ కోసం మీరెలా పొదుపు చేస్తున్నారో తెలియజేయండి. కెనరా బ్యాంక్ బాలక్షేమ ఖాత చిల్లర మొల్లరగా తిరిగే అమ్మాయిని నిజమైన తెలివిగల గృహిణిగా తీర్చిదిద్దటంలో మీకు సహాయపడుతుంది.

ప్రతిదినము మీ కొనుగోలు వ్యవహారాలలో మిగిలిన చిల్లర - నాణ్యాలు - ఒక అందమైన పొదుపు పెట్టెలో వుంచి ఆ తర్వాత కెనరా బ్యాంక్ లో డిపాజిట్ చెయ్యవచ్చు. అలలు ఏవిధంగా వాటిలోంచి అవే పెరుగుతూ పోతాయో అలాగే మీ బాలక్షేమ ఖాతా కూడా పెరుగుతూ వుంటుంది. అదంతా కలిసి ఎంత చక్కని మొత్తమయిందో చూసి మీరు ఆశ్చర్యపోతారు. ఆ! అదే కెనరా బ్యాంక్ వారి వాగ్దానం!

## లేతప్రాయం

maa CB 15 Tel-79

# పాఠకులకు విజ్ఞప్తి

పత్రికా నిర్వహణలో ప్రతి ఒక ఖర్చు అపారంగా పెరిగిపోయింది. ముఖ్యంగా కాగితం ధర రెట్టింపుకు మించిపోయింది. ఈ కారణంగా అనేక పత్రికల ధరలు పెంచబడినవి. అచ్చు అలంకరణలు వగైరాలను కొన్ని పత్రికలు పొదుపు చేసుకుంటున్నవి. కాని చందమామలో ఇలాటి పొదుపు—పేజీలూ, రంగులూ తగ్గించటం—జరగరాదని నిర్ణయించి, పత్రిక ధరను మరో 25 పైసలు పెంచి, విడి కాపీ ధర 1980 జనవరి నుంచి రు 1:50 చేస్తున్నాము. ఎంతోకాలంగా చందమామ ఎదుర్కొన్న చిక్కులను తమవిగా భావించి, పత్రికను ఆదుకొని, ప్రోత్సహించిన పాఠక మహాశయులు ఈ మార్పును సంతోషంగా స్వీకరిస్తారని ఆశిస్తున్నాము. మా ఏజెంట్లు కూడా ఈ మార్పును గమనించ ప్రార్థన.

—ప్రచురణ కర్తలు


5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరీ సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వి. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి.

(వి. పి. పి. చార్జీలు అదనం)



MERI GOLD COVERING WORKS ESTD: 1963 TRADE MARK (346088)

14, RANGANATHAN STREET, T. NAGAR, POST BOX No. 1405, MADRAS-600 017

# మీ రక్షణ యొక్క అనుభూతిని ఎల్లవేళల ఆతన్ని



# పొందనివ్వండి!

మీ పుత్రుడు, మీ ఆకాంక్ష ప్రేమమయమయిన, సుస్థిర మైన, నిశ్చింతగల వాతావరణంలో వికసిస్తాడు. ఆప్యాయత గల తండ్రిగా మీరు నిరంతరము, సుదీర్ఘము, సుస్థిరము, ఆహ్లాదకరము ప్రేమమయమైన వాతావరణాన్ని సృష్టించుటకు ప్రయత్నిస్తారు.

కాని భవిష్యత్తు సంగతేమిటి?

యల్ ఐ సి ని మీ పిల్లవానియొక్క భవిష్యత్తు అవసరాలు తీర్చుటలో సహాయపడనివ్వండి. పిల్లల విద్య, వివాహము, వృత్తి లేక ఉద్యోగముల ప్రారంభ దశ మున్నగువానికి తోడ్పడు అనేక ఆకర్షణీయమైన క్రింది పథకములనుండి ఎన్నుకొనండి:

- పిల్లల ఏంటిసిపేటెడ్ పథకము.
- విద్యా సౌకర్య ఏన్యుఇటీ పథకము.
- నియమితసమయ (వైవాహిక) ఎండొమెంటు పథకము.
- పిల్లల డెఫర్డు భీమా పథకము.
- తల్లిదండ్రులు మరియు పిల్లల జీవితముపై వివిధ ఎండొమెంటు పథకములు.

ఇంకా వివరములు తెలుసుకోవాలంటే మీ దగ్గరి యల్ ఐ సి ఏజంటునుగాని, బ్రాంచి కార్యాలయము వారినిగాని సంప్రదించండి:

**మీ పిల్లలకు ఉజ్వల భవిష్యత్తు చేకూర్చుటకై నేడే పథకమును ప్రారంభించండి.**



**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

PRATIBHA-LIC-909/79.

# రామ్ శ్యామ్

## అంతరిక్ష మానవునితో స్నేహం


























నోరూరించే
మనసుదోచే
మైమరపించే




పాపిన్స్

పండ్లరుచిగల
పిప్పరమెంట్లు




5 ఫ్రూట్ సువాసనలలో—
రాస్ప్‌బెర్రీ, అనాస, నిమ్మ
నారింజ, మోసంబి.

everest/79/PP/261-tel